# HEMALATHA

A HISTORICAL DRAMA IN FOUR ACTS.

BY

Chennapragada Bhanumurti, B. A., L. T.,








Printed at the Jyotishmati Press,

MADRAS.

1912

 [Price 8

# HEMALATHA

A HISTORICAL DRAMA IN FOUR ACTS.

BY

Chennapragada Bhanumurti, B. A., L. T.,






Printed at the Jyotishmati Press,

MADRAS.

1912

 [Price 8 Annas,

# హేమలత.

చరిత్రవిషయకనాటకము.

చెన్నాప్రగడ భానుమూర్తిచే
రచింపఁబడినది.



మొదటి కూర్పు 1000 ప్రతులు.

చెన్నపురి
జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

—

1912.

 [వెల 8 అణాలు.

# పీ ఠి క.

---

నాకు బాల్యస్నేహితులును సహాధ్యాయులును అగు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు రచించిన హేమలతయందలి యాదరముచే దానిని నాటకరూపమున వెలయింప సంజాతకుతూహలుండనై యొకప్పుడీవిషయమును వారితో సమావేశమయి యున్నప్పుడు ముచ్చటించితిని. వారును అందులకుం బ్రీతిపూర్వకముగా నియ్యకొనిన, నేను నాటకరచన కుపక్రమణము చేసి, కొలంది కాలములోనే దానిని రమారమి ముగించితిని. కాని కొన్ని యంతరాయములచే నవశిష్టముగా నుండిన స్వల్పభాగపు రచన మూడు సంవత్సరములవఱకు నిలిచి పోయినది. ఈమధ్యకాలమున కొందఱు మిత్రుల ప్రేరణచే దానిని పూరించి ముద్రణకొఱకు బ్రహ్మశ్రీ-వేదము వెంకటరాయశాస్త్రులవారి జ్యోతిష్మతీ ముద్రణాలయమున కిచ్చితిని. మూడు సంవత్సరములనుండి పడియున్న యీగ్రంథము, శాస్త్రులవారి సాహాయ్యమున నిరువది దినముల లోపల ముద్రాపితమై బయలు వెడలం జూచి, నెంతయు సంతసము నంది శాస్త్రులవారికి నాకృతజ్ఞతను దెలుపుకొనుచున్నాడను. ముద్రాపితములగు పత్రములం గడుశ్రద్ధతో శోధించినందులకై చతుర్వేదుల వేంకటకృష్ణగారికిం గూడ నేనెంతయు కృతజ్ఞుడనై యున్నాడను.

నాటకరచన నాంగ్లేయనాటక సంప్రదాయముల ననుసరించి చేసితిని. పాత్రానురూపకముగా వృత్తము ననువు పఱుచుటకు కొంత ప్రయత్నముం జేసితినిగాని, ఎంతవఱకు నాప్రయత్నము సఫలమయినదో యాయంశము ఔచితీగ్రహణపారీణులగు పాఠకమహాశయులు నిర్ణ

యింపఁగల కర్తలు. భాషగూడ పాత్రోచితముగ నుండవలెననియే నా మతముగాని, ఈవిషయమును నిర్వహించు పట్టున నేనంత శ్రద్ధవహింప మిచే నాపని నాకే యెంతమాత్రమును తృప్తికరముగ లేదు. ప్రథమ ప్రయత్నము గావున పాఠకలోకము నన్ను మన్నింతురుగాక.

పాదుషా సుసంస్కృతమగు తెలుఁగు పద్యములఁ జదువుట ఉచితము కాదుగాని, ఇట్టి యాచారము నాటక సంప్రదాయములలో కేవలమును లేనిదిగాదు. షేక్స్పియరు మహాశయుఁడు సీజరుచే నింగ్లీషు మాట్లాడించ లేదా? రసపుష్టియు సందర్భశుద్ధియు పాత్రవ్యక్తీకరణమును ఉన్నచో నీలోపమును పాఠకమహాశయులు మన్నింపఁ బ్రార్థితులు. బద్ధకు (అలసు)లకు పఠనశ్రమమును, కార్యనిష్ఠులకు కాలవ్యయమును, ఎక్కువ కాకుండ నాటకమును సాధ్యమయినంతవఱకు హ్రస్వపఱచినాఁడను.

తిరువళిక్కేణి.
12-12-12

ఇట్లు విధేయుఁడు,
చెన్నాప్రగడ భానుమూర్తి.



# కథాసంగ్రహము.

హిందూదేశమును పాలించిన మహమ్మదీయ వంశములలోఁ గిల్జీవంశమున జలాలుద్దీను మొదటి చక్రవర్తిగా 1290-వ సంవత్సరమున సింహాసన మెక్కెను. ఈతని రాజ్యకాలము ననే యీతని యన్నకుమారుఁడగు నల్లాహుదీను దక్షిణహిందూస్థానముపై దాడివెడలి మహారాష్ట్రప్రభువగు రామదేవుని జయించెను. ఈ దండయాత్రనుండి తిరిగివచ్చినతోడనే యల్లాహుదీను తన పినతండ్రిని జంపి సింహాసనమెక్కి పల్వురరాజుల నోర్చి భరతఖండమున దిగ్విజయముచేసెను. కాని చిత్తూరు రాజధానిగా నేలు జయపురమను రాజపుత్ర సంస్థానముమాత్ర మాతనికి లోబడదాయెను. చిత్తూరురాణాను నిర్జించుట కల్లాహుదీను బహుళప్రయత్నములుచేసి, కోటకు ముట్టడివెట్టి తుదకు రాజపుత్రశౌర్యమున కోహటించి, భగ్నమనోరథుడై పోవలసినవాఁ డాయెను. ఈ మహాప్రయోజనమును సాధించుటకై యఖిల కపటోపాయపారీణుడగు నల్లాహుదీను తన యుద్ధసన్నాహములకుఁ దోడుగా ననేక మాయోపాయములఁ బ్రయోగించుచు వచ్చెనేకాని మానధనుడును, రాజనీతి విశారదుఁడును, దీర్ఘసూత్రుడును, అగు జనార్దనసింగను నొకరాజపుత్రుని జాగరూకతచేతను, అప్రతిమ ప్రతిభాతిశయముచేతను, అవియెల్ల నిష్ఫలము లయ్యెను.

ఈ జనార్దనసింగును, ఈతని తండ్రియగు నారాయణసింగును, జలాలుద్దీను కొల్వున సేనాపతులుగఁ బ్రతిష్ఠగాంచి, పినతండ్రిని జంపసమకట్టిన యల్లాహుదీనునకుఁ బ్రతికూలురైనందున, నాతఁడు జనార్దనసింగును జంపను త్తరువొసంగి, నారాయణసింగును గనులు పొడిపించి వీటవిడిపించెను.

జనార్దనసింగు తప్పించుకొనిపోయి మహమ్మదీయులయెడ బద్ధమత్సరుఁడై దేవగిరి ప్రభువగు రామదేవునకును జిత్తూరుప్రభువగు భీమసింగునకును రాయబారము నడపి యీ యిర్వుర సమవాయముచే నల్లాహుదీనుని నిగ్రహింప సమకట్టి చిదానందయోగి యను పేర మారువేషమున నయ్యిరువురకు నుత్తరప్రత్యుత్తరముల నడపుచుండెను. రామదేవు నొద్దనుండి భీమసింగున కొకయుత్తరముం గొంపోవుచు నొకనాటి సాయంకాలమున నాతఁడు యమున యొద్దున నొకజీర్ణాలయములో విడిసెను. ఆ సమయంబునం గొందఱు వందిపోటు దొంగలాతనిం దలపడి, యాతనియొద్దఁగల ఉత్తరములు మొదలగు వా

నపహరించి, యాతనిం గట్టి యమునలో విడిచిరి. ఆయుశ్శేషము కల్మిచే నమ్మహాపురుషుఁడు తన బంధముల నూడ్చికొని యీదుకొనిపోయి యవ్వలి యొడ్డు చేరి, ప్రాణముల రక్షించికొని తన పూనిక నిర్వహింపం బ్రయత్నించుచుండెను.

అట నారాయణసింగు పుత్రశోక సంతప్తుఁడయ్యును, జనార్దనసింగుని కేవల పుత్రికయగు హేమలత యోగక్షేమముల నరయవలసినవాఁడై బ్రదుకుపై నాసదీరియు, ప్రాణముల నిల్పికొని, యామెతోఁగూడ, నల్లాహుదీనుబారినుండి తొలఁగిపోయి, యాగ్రామ కనతిదూరంబున నున్న పాలీయను గ్రామమున బావాజీవేషము గైకొని యొక గృహంబో మఠముఁ గల్పించుకొని వైద్యవృత్తి నవలంబించి కాలంబుఁ గడపుచుండెను.

రహిమాను ఖానుఁడను తుచ్ఛుఁడొకఁడు తన నైచ్యముచే నవాబు కొల్వులోఁ గ్రమాభివృద్ధిగాంచి, తుదకు ఖిల్లేదారుపదవినంది పాలీగ్రామమున నధికారము నెరపుచుండెను. ఈతనికిం బరవనితా పరవిత్తములం దాసమెండు. నంఘుఁడను మహారాష్ట్రసాహసికుఁడును గులామలీయను మహమ్మదీయ బద్మాషును, దనకు ముఖ్యపరిచరులుగా, నాతఁడు బందిపోటుల సాగించి వనితావ్యసనాసక్తుఁడై కాలము పుచ్చుచుండెను. నాటిరేయి యమునయొద్ది జీర్ణాలయములోఁ జిదానంద యోగిని బట్టి కట్టి యమునలో వైచిన దీనం గాదు లే.

ఆ మఱునాఁడు చిత్తూరు ప్రభువుల సేనానియగు ప్రతాపసింగుని యన్నకుమారుఁడును, నీతి విశారదుఁడును, శౌర్యస్థైర్యాద్యుదార గుణధురీణుఁడును, అగు మదన సింగను రాజపుత్రవీరుఁ డప్పుడా గ్రామమునున్న నవాబునొద్దకు రాయబారము నెరపంబోయి, మరలివచ్చునెడ, సదృశగుణశీలా కృష్టుఁడై తనయందు బద్ధ సఖ్యుండైన నాజరుజంగను మహమ్మదీయ సర్దారుడు కతిపయపరివార సమేతుండై వెంటరా, మునుమాపున పాలీగ్రామ ప్రాంతమునం బోవుచుండెను. అంతనం గాదులు మదనసింగు నాజరుజంగులను వారి పరివారమును దాకిన సంకుల సమరంబయ్యె. అందు నందుడును గులామును దక్క తక్కినవారందఱును నిహతులయిరి. ఈసమ్మర్దములో ఘాలమునఁ గంటు పడిన మదన సింగుం గొంపోయి నాజరుజంగు పాలీ తాణాలో రహిమాను భవనముం జేర, నాతడు మదన సింగును బావాజీ గృహమునకుం దోడ్కొనిపోయి వ్రణచికిత్సకై యప్పగించెను.

ఒక మాసమునకు బావాజీ చికిత్సవలనను, హేమలత పరిచర్యవలనను, వ్యపగత వ్రణుండై మదనసింగు బావాజీని వీడ్కొనునప్పు డెంతవఱకును అచ్చటనే నిల్చియున్న నాజరుజంగా గ్రామవాసియును దనయాప్తుఁడునగు నబ్బుల్కరీము నకాల్వితోఁ దన్నపైయ

మిత్రుఁడగు మదనసింగును వీడుకొనవచ్చెను. అయ్యవసరంబున నారాయణసింగు నిజ వృత్తాంతమును మదనసింగునకు సవిస్తరముగా వినిపించి తమ్ముఁ జిత్తూరు చేర్చుమనివేఁడ, నప్పటికి వారల నాతఁడు నాజరుజంగున కప్పగించెను. నాజరుజంగును వారిభారమును స్థలజ్ఞుఁడగు మాల్వీ పైనిడియెను. ఇట్లు మదనసింగు తనయాప్తమిత్రుల వీడ్కోలుపడసి చిత్తూరుచేరి, నవాబు కాపట్యమును గుర్తెఱుంగని వాఁడగుటచే నాతఁడు రాజపుత్రులతో సంధికిచ్చగించెనని రాణా మొదలగు వారితోఁ జెప్పిన వారందఱును స్వస్థచిత్తులయి యుండిరి. నాజరుజంగు డిల్లీపట్టణముచేరి, ఖానుదుర్నయముల నవాబు చెవినివైచెను.

ఖాను మదనసింగుని వ్రణచికిత్సకై బావాజీగుహకుఁ బోయినప్పుడు హేమలతను జూచి మోహించి, యాపె నెటులైనఁ దనకు సమకూర్పుమని నందునితోఁ జెప్ప, వాఁడును దన నెచ్చెలియగు రాధయను దాసిపడుచు సాయమున నందులకై యత్నించి, హేమలత చిత్తము మదనసింగునందు లగ్నమైనదని యాపెవలనం దెలిసి ఖానునకుం దెలిపెను. అంత ఖానును దనకాపె పొందు నయమున సంఘటింపదని నిశ్చయించి, యొకనాటిరాత్రి బావాజీని బలాత్కారముగాఁబట్టి కట్టి చెరసాలకంపి, నందుని హేమలతపాలఁ గాపువెట్టి, తాను మాల్వీనిగూడఁబట్టి చెరసాలకంపఁబోయెను. అప్పటికిం గొంతకాలంబున నుండి యాయూర నిల్చి బావాజీ హేమలతలం గనిపెట్టుచుండిన చిదానందయోగి, నందుడు నిద్రించుచుండం బలవించుచుండిన హేమలతను, ఖానుమరలివచ్చునంతలోపల, తటివేచి తోలంగం గొంపోయి, యాగ్రాలో నల్లాహుద్దీను సేనానియగు జయసింగుఁడను నుత్తమ శీలుఁడగు రాజపుత్రుని పాలఁబెట్టి, తాను నవాబు రహస్యములఁ దెలియంగోరి ఢిల్లీపట్టణముచేరి, కులందరు ఫకీరువేషమున నాపట్టణమున సంచరించుచుండెను.

ఇంతలోపలఁ దనదుర్నయములకై యుత్తరవాదము చెప్పుకొనుటకుఁ దన్నుఁ జక్రవర్తి పిలువనంప ఖాను ఢిల్లీ చేరెను. నాఁడు చిదానంద యోగినిగట్టి యమునలో విడిచినప్పుడాతని కక్షపాలలో రామదేవు భీమసింగునకు సాహాయ్యము వేఁడుచ వ్రాసిన జాబు నందునకు దొరకిన వాఁడు దాని ఖానున కంద జేసెను. కపటోపాయ ధురీణుఁడగు ఖానుదాని యాధారమున దనపైవచ్చిన యపవాదమును దొలఁగించి కొనుటకును బావాజీ మాల్వీలం జెరలోనుంచిన తప్పుఁగాచికొనుటకును సయుక్తికమైన యుపాయమును బన్నెను. నవాబునకుం బ్రీతికరమగు నాయుత్తరమును జూపి దానిని మదనసింగు బావాజీనుండి కొనిపోవుచుండఁగాఁ దాను దెలిసికొని త్రోవగాచి సంపాదించితి ననియు, నాజరుజంగు మాల్వీలు కూడ నీ కుట్రలోనుండిరనియు, నవాబునకుఁ జెప్పి, ఖాను నవాబుశిక్షఁ దప్పించుకొనె

టయే కాక, యాతని మెప్పుఁగూడఁ బడసెను. కాని, ఎరుకయందు మూఢవిశ్వాసముఁ గలవాఁ డగుటచే ఖానుతనయాపన్న స్థితిలో, సర్వసందర్భవేది యగు కులందరు ఫకీరు మ్రోలఁజేరి, తనభావి సుస్థితిని గుఱించి యాతనిం బ్రశ్నించి తెలిసికొని, కృతజ్ఞుఁడై ఘాదుపారహస్యములనెల్లఁ దనకథాప్రసంగవశమున ఫకీరువేషధారియగు చిదానందయోగికిం దెలిపి పోవుచుండెను.

ఖానుని కొండెములనమ్మి నవాబు నాజరుజంగును గొలువునుండి వెడల నడచెను. ఆసందర్భముననే, నవాబునొద్ద వజీరుపదవినందవేచి యుండిన వసంతభట్టను నొక మహారాష్ట్రబ్రాహ్మణుఁడు మాయోపాయంబున నవాబునకు హితంబొనగూర్పం గపటకలహము గల్పించుకొని నవాబుచే సభనుండి వెడల నడఁవంబడి, బ్రాహ్మణపక్షపాతులగు చిత్తూరు ప్రభువులపాలఁజేరెను. ఆతండు తననైచ్యముచే, మదనసింగు ప్రభృతుల పై ప్రభువుల మనసులువిఱిచి, యచిరంబుననే వారియాదర గౌరవములకుం బాత్రుఁడై మెలంగుచుండెను. చిత్తూరు రాణాయగు లక్ష్మణసింగు పిన్నవాఁడగుటచే నాతని పినతండ్రి భీమసింగు ప్రతినిధిగా రాజ్యపరిపాలనం బొనర్చుచుండెను. ప్రధానప్రభువును బాలుఁడును అగు లక్ష్మణసింగునకు, ఆతనిపై మదనసింగు ప్రభృతులు కుట్రలుచేయుచున్నారని, విశ్వాసముపుట్టఁ బల్కి, వారలం బట్టియిచ్చెదనను నెపమున నాతని నర్ధరాత్రమునప్పుడొంటరిగాఁ జేరదీసి బందిగ్రాహముసేసి యంచెలమీఁద దాటించుకొనిపోయి నవాబున కప్పగింప వసంతభట్టుచేసిన ప్రయత్నములు ఫలోన్ముఖము లగుచుండెను. అంత నంతకుమున్న చిత్తూరుచేరి సాహసోత్సుకుఁడయి సంగతులనెల్ల గ్రహించుచుండిన చిదానందయోగి పర్వమును యుక్తకాలమునం దెలిసికొని మదనసింగు సాహాయ్యముచే వసంతభట్టులోనగు వారలం దెగటార్చి, లక్ష్మణసింగునకు విడుగరయొసంగి, నవాబు కనుఁగప్పి దండయాత్రకు సకల సన్నాహమునుజేసికొని వచ్చుచున్న సంగతిని రాజపుత్రులకుఁ దెలిపెను. వారును యుద్ధసన్నద్ధులయి, ఖాను జయసింగులతో చిత్తూరుకోటకు ముట్టడివెట్టిన నవాబుసేనలను నిర్జించి పారదోలిరి. అరిశరంబులచే మేనెల్లతూట్లువడి, యొక్కయేనుంగు కళేబరంబుమాటున దాగియుండి, వెలువడం దివురునంతటనే, మదనసింగువ కగ్గంబయిన ఖాను, దీనాలాపంబుల నతని యనుగ్రహంబువడసి వ్రణవైద్యాగారంబునకుఁ బంపఁబడియె. జయసింగుతో శిబిరమునకు వచ్చియున్న హేమలత, జయసింగుని పాటువిని, పురుషవేషము గైకొని, శిబిరంబువెల్వడి మధ్యమార్గమున మదనసింగును గలిసి సంభాషించి చిదానందయోగి మఱ [illegible]చేరెను. యోగియు నంతకుమున్ను జరిగినవృత్తాంతమునెల్ల నెఱింగిన వాఁడగుటచే హేమలతను మదనసింగునకిచ్చి వివాహముసేయం గృతనిశ్చయుండై, తనతండ్రి తేమికి

వగచుచుండ నదివఱకే గ్రామవాసుల యభిమానముచేఁ జెఱనుండి విడుగరనొందిన మాళ్వ యొక్క సాహాయ్యసంపత్తిచే నాతనితోఁగూడ నారాయణసింగు చిదానందయోగి సమ్ముఖమునఁజేరెను. అంత నారాయణసింగు జనార్దనసింగు భీమసింగు ప్రతాపసింగు లోనగు వారెల్ల సమావేశమయి యొండొరుల వృత్తాంతములఁ దెలిపికొని, యాపదలఁ గడవం బెట్టి తమ్ముం బునస్సమావేశము సేసిన యనుగ్రహమునకై యీశ్వరుం గొనియాడి హేమలతామదనసింగుల వివాహమంగళము మహావైభవముతో సాగించిరి.

ఇట్లు హేమలతా పాణిగ్రహణం బొనర్చి మదనసింగు, పినతండ్రి వార్ధకమునం బరమార్థచింతనుండం దాను రాజపుత్ర దండనాథుండును, ప్రభువులకు ముఖ్యమంత్రియు నై, కార్యఖడ్గంబులం గొఱంత యావంతయు లేకుండ జయపురరాజ్య కార్యభారంబు పూజ్య మహిమ నిర్వహించుచుఁ జిరంబు, పుత్రమిత్ర సందోహంబులతోడను ధనధాన్యాది సంపదలతోడను, ప్రభువులతోఁ దులఁదూగుచుండెను.

---

# ఈనాటకమున వచ్చు పాత్రములు.

1. అల్లాహుదీను—ఢిల్లీనవాబు.
2. నాజరుజంగు—నవాబు సేనానాయకుఁడు.
3. వజీరు—ఢిల్లీనవాబు వజీరు.
4. రహిమానుఖాను—పాలీఖిల్లేదారు.
5. కరింఖాను—నాజరుజంగుని గుఱ్ఱపువాఁడు.
6. రాజపురుషుఁడు.
7. నందుఁడు—రహిమానుఖానుని పరిచరుడు.
8. గులామలీ—రహిమానుఖానుని పరిచరుడు.
9. వసంతభట్టు—నవాబు నొద్దనున్న తపదవినంద కొలువులోచేరియున్న మహారాష్ట్రబ్రాహ్మణుఁడు.
10. లక్ష్మణసింగు—జయపుర రాజ్యమునకు ప్రధానప్రభువు—చిన్నవాఁడు.
11. భీమసింగు—లక్ష్మణసింగు పినతండ్రి. రాజప్రతినిధి.
12. ప్రతాపసింగు—జయపురదండనాథుఁడు.
12. గోరాసింగు—ప్రతాపసింగుని బావమఱది. జయపుర సేనానాయకులలో నొకఁడు.
14. మదనసింగు—ప్రతాపసింగుని యన్న కుమారుఁడు. కథానాయకుఁడు.
15. జయసింగు—ఢిల్లీనవాబు సేనానాయకులలో నొకఁడు. రాజపుత్రుఁడు.
16. హేమలత—మదనసింగుని ప్రియురాలు.
17. చిదానందయోగి—హేమలత తండ్రియగు జనార్దనసింగుని మారువేషపు పేరు.
18. బాబాజీ—జనార్దనసింగు తండ్రియగు నారాయణసింగుని మారువేషపు పేరు.
19. అబ్దుల్కరీముమౌల్వీ—పాలీగ్రామవాసి యగు నొకమౌల్వీ. నాజరుజంగుని మిత్రుఁడు.
20. ఆనందుఁడు—వసంతభట్టుని పరిచారకుఁ .
21. సదాశివుఁడు—చిదానందయోగి శిష్యుఁడు.
22. దామోదరుఁడు—చిదానందయోగి శిష్యుఁడు.
23. కుమారసింగు—హేమలత మారువేషపు పేరు.
24. రాధ—నందుని నెచ్చెలియగు దాసీపడుచు.

ఇంకను భటులు, సభ్యులు, పరివారమును.

# హేమలత.

—oo:※:oo—

## ప్రథమాంకము.

---

### 1- రంగము

ఆగ్రానగరమున నొకరాజవీథి.

(కరింఖాను మందురము వంకతొందరగాఁ బరుగెత్తుచు ప్రవేశించుచున్నాడు. రాజపురుషుఁ డొకఁడు వానికెదురుగాఁ బ్రవేశించుచున్నాఁడు.)

క.—ఆదాబ్,, సాహేబ్.

రా.—ఏమి ? తొందరగాఁ బోవుచుంటివి..

క.—మా సర్దారునకు గుఱ్ఱమునాయితంబుసేయఁ బోయెదను..

రా.—ఇంతయెండలోనే మీసర్దారు సికారునకుఁబోవునా యేమి ?

క.—మా సర్దారున కెండయుకొండయు లేదుగాని గుఱ్ఱముమాత్రము సికారు అనుగాదు సవారుకొఱకే.

రా.—నాజరుజం గెక్కడకు ప్రయాణము పెట్టుకొన్నాడు ?

క.—రాజపుత్ర స్థానమునుండి రాయబారమునకై మన యాగ్రాపట్టణమునకు వచ్చి నవాబుగారి దర్బారులోనున్న మదనసింగును మీ రెఱుంగుదురా ?

రా.—ఆతఁడిక్కడనున్న యీ నెలదినములలోనే యాబాలగోపాలముగా గల సకలజనులకును గంటిలోని పాపయైయున్నాడు.. ఆతని నెఱుంగ కేమి ?! పైసంగతి చెప్పుము.

క.—ఆతఁడందఱకు [illegible]టిలోని పాపయైన,, మా నాజరుజంగు. గారికి తలలోని నాలుకయే. వారిరువురు నొండొరులఁ జూచినప్పటినుండియు పాలును నీరునుంబోలె నొక్కదేహమై మెలంగుచున్నారు.. మదనసింగు నవాబు నొద్దనుండి సెలవుగైకొని ఈప్రొద్దు స్వరాజ్యమునకుఁ బోవనున్నాడు. మాసర్దారాయనను విడువలేక పాలితాణావఱకు సాగనంపఁ బ్రయాణసన్నాహములో నున్నాడు. ప్రొద్దువోవుచున్నది. పోయివచ్చెదను.

రా.—మంచిది.

[ఉభయులు నిష్క్రమించుచున్నారు.]

## రంగము - 2

ఢిల్లీనగరము — అల్లాఉద్దీను దర్బారు.

(పాదుషా, వజీరు, వసంతభట్టు, నాజరుజంగు, కాఫరుమల్కు మొదలగు సర్దారులును ప్రవేశించి యున్నారు.)

అ.—

ఉ. సేతువుదాఁటి శీతనగశీర్షము ముట్టియు సింధుబ్రహ్మపు
త్రా తతకూలముల్దొరసి రాజులునా పృథురాష్ట్రిముందున
స్మితమయూఖబింబమునఁ జేరినమచ్ఛయుఁబోలె నక్కటా!
చేతముఁ జిక్కువెట్టెడిని చిత్తురురాజ్యము దుష్ప్రధర్షమై.

చిత్తూరుఁ గూల్పక నాకుం జిత్తశాంతిలేదు. కావున నీతివిద్యావిశారదులగు నో మంత్రిపుంగవులారా! రణప్రవీణులగు నో దండనాథాగ్రణులారా! చిత్తూరుఁగూల్ప మీమీచిత్తంబులఁదోఁచిన యుపాయంబుల నుపన్యసింపుఁడు.

వజీ.—

ఉ. వంగమునుం ద్రిలింగమును ద్వారసముద్రము ఘూర్జరంబును
త్తుంగత నొప్పు వింధ్యగిరి దుర్గములు న్వెసఁదాకి భద్రమా
తంగ తురంగపత్తి సముదగ్ర చమూహతి గూల్చు నాజరుం
జంగును గాఫరు న్మలకసాగిన వైరులు నిల్వ నేర్తురే.

కావున మన బలంబులంగూర్చికొని దాడివెడలి చిత్తూరుకోటను ముట్టడివెట్టినం గూలు టెంతపని.

వసం.—ఆపని యంత సులభసాధ్యముగాదు.

ఉ. సింగపు గోరల న్బెరుకు చేవయుఁ బిడ్డులఁబట్టు ధైర్యముల్
సంగర రంగమంద సమ సాహసమున్నలి వోసి శౌర్యముల్
రంగదరాతిసైన్యవిసర ప్రళయంకర విక్రమంబులున్
సింగుల కుగ్గుబాలనె జనించిన యద్భుతశక్తులారయన్.

అందున మదనసింగు పరాక్రమం బప్రతిహతం బగుటే లోకవిశ్రుతంబు,

ఉ. సింగుల సింగమా మదనసింగు కృపాణము కేలఁగ్రాల నా
జిం గడుబేర్చి సైన్యములఁ జిందర వందరసేసి భద్ర మా
తంగ తురంగ సద్భట శతంబుల వ్రేల్మిడి నుగ్గుసేయ నా
యంగజ వైరి కైన నిల నడ్డుసార నశక్యమే తలంపగన్ ॥

మఱియునుం బ్రతాపసింగు గోరాసింగు లతనికిం దోడైనిలిచిన భీష్మద్రోణు లభిమన్యునకుం బ్రాపైనట్లగు. కావునం గేవలదండోపాయంబున రాజపుత్రుల నిర్జింప నిర్జరులకైన నలవికాదు. ఎద్దియేని మాయోపాయంబు పన్నవలసియున్నది. నాకుం దోచిన యుపాయంబిట్లు (అని పాదుషా చెవిలోఁజెప్పుచున్నాడు)

అ.—సెబాస్ ! విప్రవర్యా, బృహస్పతివంటి బుద్ధిమంతుఁడవు నీవు మంత్రిత్వము నెరప మాకుం గానికార్యంబుండునా ? నీ యుపదేశమునే యనుసరించెదము. తదనుసారముగాఁ గొంత యిదివఱకే చేసియుంటిమి. మొన్న రాయబారమునకై మదనసిం గాగ్రి పట్టణమునకు వచ్చినప్పుడు మాయుద్దేశములను మఱుఁగుపఱచి, చిత్తూరుపై దండయాత్ర సంక్షేపించికొంటిమనియు, వారును మనమునుగలిసిన యనన్యభేద్యుల మగుటచే వారితో మైత్రియే మనకభీష్టమనియుఁజెప్పి పుచ్చితిమి. కొద్దివ వ్యవహారములు గాలానుగుణముగా నిర్వర్తించెదము. మధ్యాహ్నమయినది. నేటికిం గొలువుచాలింతము. (అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

## రంగము. 3.

---

పాలిగ్రామము - రహీమానుఖానుని లోపలిసౌధము.

( రహీమానుఖాను, నందుడు, గులామలీ ప్రవేశించుచున్నారు. )

నం } —సలామ్, సాహెబ్.
గు }

ర.—ఏమి సమాచారము, ఈసారి యేమేమి కాన్కలుదెచ్చినారు.

న.—మీ దయవల్లను మాతల్లులకడుపు చలువను నేటికిఁ బ్రాణములతో వచ్చితిమి. ఏమిచెప్పెదము స్వామీ ! నిన్నటిరేయి చీకటిగవియునప్పటికి యమునయొడ్డున చిట్టడవిలో మార్గముపొంత నూటున నున్న మావీనులకు మార్గస్థులయులివు విన వచ్చినది. బిడ్డారనునూహచే మేము ఇరువదియేవుర మొక్క సారిగా చుట్టుముట్టితిమి.

ర —అచ్ఛా, బోలో.

సం.—ఆయుధపాణులును అశ్వారూఢులును అగువారు విజృంభించిన మాయూక విచ్చి పారఁజొచ్చినను వారు మాపైకుఱికి చిత్రవధం బొనరింపఁజొచ్చిరి. అందొక యౌవనవంతుడగు భటుడు దూరముపారిన మమ్ము పదిమందిని దాకిన మేమొక్క మొగముగాఁగవిసితిమి. నేను పైకుఱికి యాతని మొగమున నాఖడ్గమును వైచితిని గాని, యాతఁడా వ్రేటుఁగొని, మేనువంచి చిత్రగతులఁజరించుచు కరకౌశలము నెరపి విజృంభించిన నందఱు నిహతులయిరి - మే మిరువురము మాత్ర మొక పొదమాటునఁ బొంచి ప్రాణముల రక్షించి కొంటిమి.

ర.—[స్వగతముగ] ఆహా! ఈ శూరుడు నిన్నటిరేయి నేను గుహలోని బావాజీ చికిత్స కొప్పగించిన మదనసింగుగా నోపు. ఇపుడు మాయింటనున్న నాజరుజంగు అందుండెనేమో అడిగి తెలిసికొనియెద. (ప్రకాశముగ) ఓరీ! నందా, మిమ్ముఁ దాకినవారిలో మహమ్మదీయ సర్దారొక డుండెనటరా?

నం.—చిత్తము మహాప్రభూ, ఆతఁడు కూడఁగడు శౌర్యముతో విక్రమించినాడు.

ర.—ఓరి పశుప్రాయులారా, మీరుచేయు పనియందు మెలఁకువఁ గల్గి కంటికిఁ దగులునదియు కాలికిఁదగులనదియు గుర్తెఱిఁగి వర్తింపవలదా? మీరు నాజరుజంగును జెనకి చేటుఁదెచ్చితిరి. నాజరుజంగు నవాబున కాంతరంగికుఁడు. నేను దారులుగొట్టించుచుంటినను వదంతికే గొంకుచుండ నేఁడు నాజరుజంగునకే యిందలి యాథార్థ్య మనుభవసిద్ధమయినదే. ఆతఁడీ సంగతి నవాబుతో నించుక సూచించిన నేమి కీడు మూడునో కదా. అందులకు పరిహారమేమియుఁ దోచకున్న యది. ఛీ! బుద్ధిహీనులారా, దీనికంతకును మీ యవివేకము కారణము. నేనిఁక మీ మొగములు చూడనొల్లను.

నం.—మహాప్రభూ ! ఎఱుఁగక చేసిన యపరాధమునకు మన్నింపవలెను. ఆగ్రహమువచ్చిన మేము చేయునదిలేదు. రహస్యగోపనమునకై మేమెంతటి పనులైనఁ జేయుచుంటిమి. మొన్నటిరాత్రి యమునయొడ్డున జీర్ణాలయములో నొకయోగి చీకటిచాటున మామాటలు విన్నందున మనగుట్టు బయటపడునను భయముచే హానింగట్టి యమునలో విడిచితిమి. వానికతుపాల వెదకఁగా నీకాగితములకట్టమాత్రము దొరకినది. (ఎదుటఁ బెట్టుచున్నాడు.)

ర.—(విప్పిచూచి యందొక కాగితమును జదివికొని మొగము మందహాసముచే విప్ఫారఁగా) గులామా, నీవిఁక భోజనమునకుఁబొమ్ము. [గులాము నిష్క్రమించుచున్నాడు] నందా! నీవెంతయు బుద్ధిమంతుఁడవు. నాకొక కార్యమునఁ దోడ్పాటు చేయవలయును. నిన్నటిరేయి నాజరుజంగు ప్రియసఖుఁడగు మదనసింగును వ్రణచికిత్సకై యప్పగింపఁ బోయినపు డాబావాజీగుహలో నొక నవమోహనాంగిని జూచితిని. నీవెట్టులైన నామె నొప్పించి నన్నుఁగూర్చెదవేని నీకుం బెద్దపారితోషికం బొసంగెద.

నం.—శివ! శివ! ఆపెయెంతయు గుణశీలసంపన్నురాలు. ఆబావాజీయుఁ దన వైద్యకౌశలముచే నందఱకును బరమాప్తుఁడు. కావున మీ సెలవిచ్చినపని దుర్ఘటము.

ర.—ఛీ! కృతఘ్నుఁడా, నీవు తిండికి మిండడవు పనికి బద్ధకుఁడవు. పోపొమ్ము? నా కనులంబడకుము.

నం.—ఆగ్రహమువలదు స్వామీ. గుహప్రక్కయింటనున్న రాధయను నొకదాసీ పడుచు నాకు నెచ్చెలి. దానిసాహాయ్యముచే మీకార్యము నిర్వహింపఁజూచెదను.

ర.—అచ్ఛా! నీవు కార్యమునకుఁబూనిన సాధనములకుఁ గొఱంతయుండునా? నా కీప్రియంబు సేయుము. పోయిరమ్ము.

[అందఱు నిష్క్రమించుచున్నారు]

---

## రంగము. 4.

### బావాజీగుహ.

(బావాజీ, హేమలత, మదనసింగును ప్రవేశించుచున్నారు.)

మ.—మహాత్మా! పరమదయాసముద్రులగు మీయుపకారమును, సుగుణమణి యగు మీ హేమలత యుపచారమును జన్మములో మఱపునకురావు. నేవచ్చి నెలదినములు దాటినది. మారాజాస్థానమున ననేక కార్యములు మించిపోవుచున్నవి. నేనిఁకఁ దడవు సేయక పోవలయును. పోయివచ్చెద ననుజ్ఞ యొసంగుడు.

బా.—నాయనా! మాకుం బరమాప్తుఁడవగు నీకు నేఁజేసికొనవలసిన విన్నపమొకటి కలదు. యుక్తకాలమువచ్చినపు డిఁకదాపనేల. చెప్పెద నవధరింపుము. కాలముతప్పివచ్చిన నే నిట్లుండవలసియుంటినే కాని నేను నీవలెనే ఉత్తమ రాజపుత్ర వంశ జాతుఁడను. సాకౌ.

పురము జయపురము. పేరు నారాయణసింగు. నేనును నాకుమారుఁడగు జనార్దనసింగును అల్లాహుదీను పినతండ్రియగు జలాలుదీనుకొలువున ఫౌజుదారులుగాఁ జేరియున్న కాలమున, రాజ్యలోభముచే నల్లాహుదీను పినతండ్రినిజంప సమకట్టిన మేమందులకియ్యకొనమైతిమి. అంతనాక్రూరుఁడు నాకుమారనిం జంపించి, నాకండ్లు పొడిపించి నన్ను వీటవిడిపించెను. ఇట్లంధుండనై పుత్రశోకమునఁ బ్రాణములమీఁది యాసదీరఁగను, నాప్రియపౌత్రియగు నీచిన్నదాని నిమిత్తము దుఃఖమును దిగఁద్రావి, కష్టములకోర్చి, ప్రాణములు నిలుపుకొనవలసినవాఁడనైతిని. కాని యాక్రూరుని బారికిందొలఁగి యిక్కడ ప్రచ్ఛన్నముగాఁ గాలక్షేపము చేయుచుంటిమి. ఈశత్రుమధ్యమున నెప్పు డేమికీడు మూడునో చెప్పరాదు. భీమసింగు మహారాజుగారికి మాయవస్థ విన్నవించి మమ్ము జయపురముఁ జేర్చిన మా కీయిడుమలు వాయును. నాయనా, మమ్మీకష్టములనుండి గట్టెక్కింప దైవము నిన్ను జూపినాడు. మాకెన్నటికైన నంతటి భాగ్యమబ్బునే?

ఉ. పుట్టితి భూరి విక్రమ సమున్నతి నొప్పెడు రాజపుత్రులం
బెట్టె యదృష్టహీనుఁడను యెవ్వరునెవ్వఁడ నెందు బొందరా
నట్టి విపత్పరంపరల నక్కట! కుందుచుఁ జావనేర నిం
కెట్టివి చూడనుంటినో! మహోన్నిజకర్మము దాటశక్యమే.

[అని యేడ్చుచున్నాడు.]

మ.—ప్రారబ్ధ ముపభోగక్షపితముఁ గావలసినదే కదా? దానికై మీవంటి వివేకశాలురు గూడ నిట్లు బేలపడుదురా? మహాత్మా శమింపుడు శమింపుడు.

(అబ్దుల్ కరీము మాల్వీతోఁగూడి నాజరుజంగు ప్రవేశించుచున్నాడు.)

మ.—మిత్రమా, వచ్చితివా? నీవు ముసల్మానుడవు నేను రాజపుత్రుఁడను. వేషభాషలలో నెంతయో యంతరముండినను మనహృదయము లిట్లు చేరఁబారుటకుం గతం బేమొకో? దీనికింత యచ్చెరువేల?

చ. రవి యుదయింపఁ దమ్మిగమి రంజిలు నెంతయు, చంద్రకాంతముల్
ప్రవిమల హర్షబాష్పముల భాసిలు నాశశి మింటఁదోచినన్
భువిపయి బాహ్యసంస్థితులఁ బుట్టవు స్నేహములంతరంగ సం
భవములు ప్రేమబంధములు, పైపయిఁదోచవు వానిమూలముల్.

మిత్రరత్నమా, పోయివచ్చెద.

నా.—ప్రియమిత్రమా, నీకు శుభంబగుఁగాక ; మనకుం బునస్సమావేశం బెట్లు ?

మ.—సదయహృదయా, మన ప్రభువులకుం బొందుపాటుఁగునేని ఈవిధమ్మునను, పోరుపాటుసంగిన యుద్ధముఖమునను; ధర్మప్రవృత్తి నుపాధులెట్లు వర్తించినను మన యంతరంగములు మాత్రము వేఱు కానేరవు

నా.—ఖాను దుర్మార్గుడు, మార్గమున మెలఁకువఁగలిగి యుండవలెను.

మ.—ఆహా జ్ఞప్తికిఁ దెచ్చితివి ; ఈముదుసలి బావాజీయు, త్రిలోకసుందరి యగు హేమలతయు నిటనుందురు. ఖానువలని యుపద్రవము నాకంటె వారికి మెండు. వారి నొక కంటఁ గనిపెట్టుచుండ వేఁడెదను.

నా.—ఈ మహాపురుషుఁడు అబ్దుల్కరీముమౌల్వీ యను నొకపరమ పావనుఁడు. నాకుం బ్రాణమిత్రము. ఈయూరివారికి బహిఃప్రాణమే. వీరి సంరక్షణ ఈతనిపైనిడిన వీరిని సిగపూవాడకుండ రక్షింపఁగలఁడు.

మ.—(మౌల్వీతో) మహాత్మా, ఇదివఱకుఁదమ యశశ్శరీరముతో పరిచితిఁగలిగి యుండియు నీమధ్య నాకుఁగల్గిన యస్వాస్థ్యముచేఁ దమదర్శన మిదివఱకుచేసికొని యుండనందులకు క్షమింపవేఁడెదను.

అ.—నాయనా, ఆత్మయొక్కటై యుండ నిట్టివి లోపములుగా నోపునా? దీనికేల నింత యపచారము చెప్పికోలు?

మ.—ఓ సౌజన్యనిధీ! నన్నాశీర్వదించి నాకు సెలవొసంగుము, పోయివచ్చెద.

అ.—నాయనా, పోయిరమ్ము, మమ్ము మఱవకుము.

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

---

# హేమలత.

## ద్వితీయాంకము.

### రంగము. 1.

బావాజీగుహ యెదుట వీధిలో

(నందుడును రాధయుఁ బ్రవేశించుచున్నారు.)

రా.—చిరపరిచితనైనను నాకామె యెప్పటికప్పుడు క్రొత్తగాఁ గనుపడుచుండు నేకాని చనవుసాగనీదు. ఈప్రొద్దు మనఖానుప్రచారము ప్రాసంగికముగా నామె సమ్ముఖమునఁ దెచ్చి పర్యవసానమును దెల్పెదను. నీవించుకదూరమున వేచియుండుము.

నం.—అలాగే పోయిరమ్ము.

[నందుడు నిష్క్రమించుచున్నాడు.]

రా.—చెలీ, హేమలతా!

(హేమలత తలుపుదీసిన నిరువురును లోనికిఁ బ్రవేశింతురు.)

రా.—చెలియా, బహుళపక్ష చంద్రరేఖయుంబోలె నానాటికి క్షీణదశకు వచ్చుచుంటివేకాని, నీకుఁ జేయించిన యుపచారములవలన ప్రయోజన మించుకయుఁ గానరాకున్నది. బావాజీ వైద్య కౌశలము, చిదానందయోగి రక్షరేకలును నిష్ఫలములయి పోయినవి. నాకుంజూడ వ్యాధియొక త్రోవను చికిత్సలొండొక త్రోవను బోవుచున్నట్లు గన్పట్టెడిని. ఇప్పటికి గుణము గనిపెట్టినవారులేరు. నేటి నీయవస్థ నాకుం జూడ దుర్భరముగా నున్నది.

సీ. వెలఁది నీనెమ్మోము తెలతెలగ వేగ వె
ల్వెలబారునెల బోలె నలరు నేఁడు।
నెలఁత నీనెమ్మేను బలితంపువేసవి
వసివాడు పసితీగె పసఁదప్పెఁ।
కాంత నీకెమ్మోవి కసుగందె సెగఁబడ్డ
కిసలయంబునుబోలె మిసిమిదొరఁగి।

మలయానిలము నిన్ను విలయానలములీల
నలయింప సాగెనో చెలియ నేఁడు।
గీ. కాముశరవహ్ని నీగాత్ర హేమమకట
ఘర్మజలపూర మిషమునఁ గరఁగితోరఁగు
నింక నేటికి దాచెదే యిందువదన
నీమనోహరుఁ దెల్పఁగా నేమిసిగ్గు॥

హే.—నీవీ యత్యూహలు చాలించి మిన్నకుండుము.

రా.—నీ ప్రాణసమాన నగు నా యొద్దనా నీ కీవెఱ్ఱసందియములు ?

ఉ. ఖాను వయో విలాసములు గాంచిన నాటనుగోలె నిట్లు నీ
మేన వికారములొ్త్విశమి మించెను నాతఁడె చూడఁజూడ నీ
మానమనోహరుండికను మానిని నీవనుమాన మంతయుఁ
బోనిడి పల్కుకున్న నగు మోసము దాపగ నేల తెల్పుమా॥

హే.—(రెండుచెవులును మూసికొని) హరి, హరీ, ఇట్టి కర్ణకఠోరములు పలుకకుము.

సీ. తియ్యమావిచిగుళ్ళు దిని కలధ్వనిసేయు
కలకంఠమిల నింబములను గనునె?
చదలేటి తరగల జలకేళి విహరించు
కలహంసి పల్వంబులకుఁ జనునె?
తొలుకారుచినుకుల నెలమిఁ గ్రోలఁగఁ జూచు
చాతక మిలనొండు జలముగోనునె?
పండువెన్నెలజుట్టు నిండు వేడుక నుండు
నలచకోరక మన్యములఁ దలఁచునె?
గీ. మోదనసింగను నభినవ మదనమూర్తి
మఱగు చిత్తంబు దలఁచునో మనుజమాత్రు
లను లతాంగిరో? ఇఁక నవ్యాజనుల నుద్దు
లేల వినుపింప? నామ్రోలఁ జాలుచాలు॥

(స్వగతము) ఆహా! రోసమెంత మోసముసేసినది. ఆదుర్మార్గుని యూసువిన్న యీసున నీ దాసికి నాగుట్టు బైటఁబెట్టితిని. రహస్యము పెదవిదాటిన పృథివిదాటునందురు. అకటకటా, ఎంత బేలనైతిని.

రా.—కిశోరిమి నేఁ జేసిన నేరమును సైరింపవేఁడెద పోయివచ్చెద.

[అని నిష్క్రమించుచున్నది.]

[హేమలత తలుపు మూయుచున్నది]

నం.—[రాధచెంతకుఁజేరి] ఏమిచేసికొని వచ్చినావు? పండా, కాయా?

రా.—ఇఁక నీ యడియాసలుడుఁగుము - హేమలత చిత్తము మదనసింగు నందుఁ దగిలినది. మరల్ప నెవ్వరివశమును గాదు. ఖా నామెపైయాస లిఁక మానుటుచితము.

నం.—ఛీ! మాసమునుండి మనచేసిన ప్రయాసలన్నియు వ్యర్థమాయెఁగదా. ఖానుతో విన్నవింపఁబోయెద.

రా.—పొమ్ము నేనును బోయివచ్చెద.

[నిష్క్రమించుచున్నది.]

నం.—ఇఁక మాఖానునకు హేమలతపొందు నయమున సంఘటింపదు. దుర్నయమునకుఁ జొత్తమన్నను, బావాజీ తనసౌజన్యముచే జనవశీకరణముఁ గలవాఁడు. ఆతనిం గడతేర్తమన్నను మాల్వీ వారిని కంటికి రెప్పవలెఁ గాచుచుండును. వీరిరువురఁ గడకొత్తు వెరవు ఖానుతో నాలోచింపఁ బోయెద.

[నిష్క్రమించుచున్నాడు.]

---

## రంగము - 2

---

### బావాజీ గుహ.

(రహిమానుఖాను నందుడుఁ భటులును ప్రవేశించుచున్నారు.)

ఖా.—[ద్వారమునఁజేరి] హల్లో, బావాజీ!

హేమలతః—ఇదెవచ్చెద. [వచ్చి తలుపుఁదీయుచున్నది.]

ఖాను.—[బావాజీముఖమున ఖడ్గమెత్తి నిలిపి] ఓరీ! కపటసన్యాసీ! నీ గుట్టు మాకుఁ దెలియవచ్చినది. మాయాయోగివై చక్రవర్తిపై కుట్రలుపన్నుచుంటివి. ఇఁక నీ యాటలుసాగవు. బకధ్యానము చాలించి యిటురమ్ము.

బా.—అయ్యో! నే నేపాపము నెఱుఁగనే.

ఖాను.—ఓరి మూర్ఖులార! చూచెదరేమి? ఈకపటాత్మునిం బట్టి కట్టి చెఱసాలకుం గొనిపొండు. (వార లట్లు చేయుచున్న)

హేమలత.—(అడ్డముసొచ్చి బావాజీకంఠముఁ గౌఁగిలించుకొని యేడ్చుచు)

ఉ. తల్లిని దండ్రిని న్మఱచి తాతయె సర్వమటంచు నెంచి ని
న్నెల్లవిధంబులం గొలుచు చియ్యెడఁ బ్రొద్దులు పుచ్చుచుండఁగా
నల్లవిధాత నిర్దయత నక్కట! నిన్నును బాపనెంచఁగాఁ
జెల్లునె? దిక్కుమాలి యిఁక జీవితమేగతిఁబుత్తు దైవమా!

(అని మూర్ఛిల్లుచున్నది.)

బా.—(తన్ను భటులు కట్టికొనిపోవుచుండ హేమలతను జూచి) తల్లీ, నేటితో మన ఋణానుబంధము తీఱెఁగదా!

చ. కొడుకులఁ బొట్టఁబెట్టికొని గ్రుడ్డితనంబునఁ గుంది యాపద
ల్గడుకొని శల్యశల్యమున గాడఁగనాటియు నీనిమిత్త మీ
యిడుమలకోర్చి ప్రొద్దులిటు లెట్టులొ పుచ్చుచునుండ నిన్నిట
న్విడిచి చనంగనయ్యె! నిఁక నిల్పఁగ నేటికి మేనఁ బ్రాణముల్?

ఉ. ఆకుమఱుంగు పిందెక్రియ నన్యులకంటికిఁ దోఁపకెప్పుడు
న్నాకడ నుండువెన్నడును నన్నెడఁబాయ వొకింతయేని నీ
యాఁకటి ప్రొద్దెఱుంగవు మహాసుకుమారము నీమనంబు నీ
వేకరణిం జరింతు విఁక నీయరిమధ్యమునం దళోదరీ!

తల్లీ, యెట్టిమోసమయ్యె. నాప్రయాసలు వ్యర్థమైనవిగదా. నాయాసలు మంటఁ గలిసెఁగదా. అనాథలకు నాథుఁడగు దైవమే నీకింక శరణము.

ఖాను.—ఏల తడవుసేసెదరు? సత్వరమునం గొనిపొండు. (భటులు బావాజీని గట్టికొనిపోదురు.) ఓరీ! నంద్యా, నీవిగృహద్వారమున నిల్చి హేమలతం గని పెట్టుచుండుము. నేఁబోయి మాల్వీనిగూడఁ బట్టి చెఱసాలకంపి ఇదె వచ్చెదను.

[భటులును దానును నిష్క్రమించుచున్నారు.]

సం.—నాకుఁ గడచిన రెండురాత్రులును గంటిమీఁద రెప్ప వ్రాలుటలేదు. హేమలత వంటయింటి కుందేలు. ఎందుఁబోఁగలదు? నేనించుక నిదురించెదంగాక. (నిదురవోవుచున్నాఁడు.)

హే.—అక్కటా! ఎట్టిగతిపట్టినది? ఏమిసేయుదాన? ఎందుజొత్తు? ఎవ్వరు దిక్కు? నారాయణుం డార్తత్రాణపరాయణుఁ డందురు. అకటకటా! నావంటిపాపాత్మురాండ్రపై దైవమైనం గడకటంపడునే? అయ్యయో!

సీ. కలుఁగడే నాపాల కలరూపమాత్మల
నిలుపు యోగులపాల నిలుచువాఁడు
కావడే నను జన్మకర్మంబులనువీడఁ
గనుడాయు భక్తులఁగాచువాఁడు
చూడడే నను గంట శుద్ధాత్మలను దన్ను
జూచు జ్ఞానులనెల్లఁ బ్రోచువాఁడు
ప్రోవడే నను దుఃఖమునమున్గి తనునెంచు
దీనులఁ దరిజేరఁ దీయువాఁడు

గీ. కరుణనీరధి, కల్యాణకల్పకంబు,
పతితపావనుఁ, డార్తులపాలివేల్పు,
మానభంగంబు గాకుండ మానవతులఁ
బూని కాచెడు పుణ్యుండు, గానరాడె!

(చిదానందయోగి ప్రవేశించుచున్నాఁడు.)

భక్తజన హృదయాంగణపారిజాతుం డేల రాకుండు? ఇదె వచ్చుచున్నాఁడు. స్వామీ! ఆర్తరక్షామణీ! నాపాలిదైవంబుగా విచ్చేసితిరా? ఇఁక నాభయంబుదీరె. దయచేయుడు స్వామీ! నాగతి యిట్టులయినది! (అని పాదములఁబడుచున్నది.)

చి.—అమ్మా! చేలతనంబున నిలీలం బలవించుట కిది కాలంబుగాదు. ఆదుర్మార్గుఁడు మఱలిరాకమున్న నీతుచ్ఛుఁడు మేల్కొనకమున్న చెచ్చెర నావెంటం జనుదెమ్ము.

హే.—మహాప్రసాదము స్వామీ;

(ఉభయులును నిష్క్రమించుచున్నారు.)

ఖాను.—(తిరిగివచ్చి హేమలతలేనిగృహను నిదురించుచున్ననందుని జూచి వాని తలఁదన్ని) ఛీ! లుచ్ఛా, నా ప్రయాసమెల్ల వ్యర్థముచేసితివి. ఇంక నీతప్పు క్షైరింప.

నం.—(సంభ్రమముతో లేచిచూచి) మహాప్రభూ, మహాపరాధము సేసితిని. ఈ తప్పుఁగాచిన మీ యనుగ్రహము వడసెదను. (అని పాదములఁబడు చున్నాఁడు.)

ఖా.—అరేసువ్వర్ ! నీ ప్రమాదములచే నెంతమోసము వచ్చినది ? పాదుషా గారి యొద్దనుండి హుకుం చేరినది. కష్టములలోనే నష్టములు వచ్చును. మీ కొప్ప గించిన పనియెల్లపాడు. సంజాయషీ చెప్పుకొనుటకు నేనురేపు ఢిల్లీదర్బారునకు పోవలసి యున్నది. నేను మఱల వచ్చుతఱికి హేమలతందెచ్చి యర్పింపవేని నీ ప్రాణముల పై యాసవీడుము.

నం.—మహాప్రసాదము స్వామీ.

(అందఱును నిష్క్రమించుచున్నారు).

---

రంగము—3.

---

ఢిల్లీలో నవాబు లోపలిమందిరము.

[అల్లాహుదీను హుక్కాత్రాగుచుండ ద్వారపాలకుఁడు ప్రవేశించుచున్నాడు]

ద్వా.—హుజూర్ ; హజారమున—

అ.—అరేసువ్వర్! ఎందుకువచ్చితివి. నీ కేమిపనిలేదు? పో; హజారమున నేమి?

ద్వా.—హుజూర్, రహిమానుఖానువచ్చి హజారమున నిల్చియున్నాఁడు.

అ.—రహిమానుఖానా, బులావ్.

(నిష్క్రమించి రహిమానుఖానుతో ప్రవేశించుచున్నాఁడు).

ర.—సలామ్ సర్కార్,

అ.—అరేబద్మాష్! మాసర్దారులదోవలు కొట్టించుటకటరా నిన్ను మానవు కరీలో నుంచినది? నీసమాచారమంతయు నా జరుబంగువలనఁ దెలిసినది. ఏమి చెప్పు కొనెదవు?

ర.—సర్కార్! నేను నిరపరాధిని; రక్షింపవలెను. (అనిపాదములఁ బడు చున్నాడు).

అ.—(తలఁదన్నుచు) అరేబత్మార్, నిజముచెప్పుము?

ర.—నిజము చెప్పిన నిష్ఠురముగా నుండునని శంకించుచున్నాను.

అ.—డర్ నై, బోలో.

ర.—మీరునమ్మిన యోధులను కొందఱిని తగిలివచ్చునది చాలాకలదు. మన్నించిన నిదర్శన పూర్వకముగ ఋజువు చేసికొనియెద.

అ.—అచ్ఛా, బోలో.

ర.—(స్వగతముగా నవాబుకు వినవచ్చునట్లు) ఆహా! నా జరుజంగు మాట మఱచి నోరుజారితిని. సామాన్యముగాచి కొన నాతురుఁడనై నా నేస్తమునకుఁ గలుఁగు నపాయమెంచనైతి.

అ.—క్యారే, నాజరుజంగును తిట్టెదవురా?

ర.—చిత్తము, మహాప్రభూ, నాజరుజంగునాకుం బ్రాణస్నేహితుఁడు. నాకుఁ దెలియ వచ్చిన సమాచారము నందతనికి తగిలి వచ్చినదియుఁ గలదు. ఈ నేరమునకంతకు నన్నుం బాత్రునింజేసిన నోడంబడుదునుగాని నాప్రియమిత్రుఁడగు నాతనికట్టి యవమాన మునకును నేను నిమిత్తంబుగా నోప.

అ.—అరే నాజరుజంగు, వాఁడే నామీఁదకుట్రలు చేయుచున్నాడా; ఫర్వానై బోలో.

ర.—అయ్యా అనుగ్రహించి మీ యాగ్రహమున కంతకు నన్నుం బాత్రుని జేయ వేడెద.

అ.—ఇఁక నీమాటలు చాలిఁచి వాస్తవము యావత్తు చెప్పుము. లేనియెడల నిన్ను ను నాజరుజంగును గూడ పట్టి బందిఖానాలో వైచెదను.

ర.—అరే, అల్లా! తప్పని సరివచ్చినదే. సెలవయినయెడల బహిర్ద్వారమునన్ను నానవుకరునొద్ద కాగితములున్నవి; తెచ్చి నిదర్శనపు దస్తావేజులతో యావత్తు సమాచారము మనవిసేసికొందును

అ.—సాతో జావ్, జల్దీఆవ్.

[ఖాను నిష్క్రమించుచున్నాడు]

(బహిర్ద్వారమ్మున నవుకరు నొద్దనుండి ఖానుకాగితములు పుచ్చుకొనఁబోవుచుండఁగా కలందరుఫకీరు పాడుకొనుచు వీధిలో బోవుచున్నాడు.)

ఫ.—అల్లాకానాంప్యారా, మౌలాకానాంప్యారా-జగ్ జూటా రేవతన్ - అల్లాహో అక్బర్ - మహామ్మద్ రసూలిల్లా.

ఖా.—అస్సలామాలేఖుమ్.

ఫ.—ఆలేఖుమస్సలాం.

ఖా.—మీరు మహాత్ములు - నేఁడు నేనొక మహాపదలోనున్నాను. ఏమి కానున్నదో సెలవియ్య వేఁడెదను.

ఫ.—మహమ్మద్ మౌలా అల్లీ - రహిమానుఖానుగాదా నీపేరు? నీపైని దుర్మార్గులెవరో చక్రవర్తితో నేరములు చెప్పి నీయందాగ్రహము పుట్టించిరి. ఇంతియేకదా నీ యాపత్తు?

ఖా.—[ఆశ్చర్యముతో] వాజీబ్, సర్కార్, మీరు దైవజ్ఞులు - జనులహృదయములు మీకుం గరతలామలకంబులు. కానున్నది సెలవిండు.

ఫ.— నీ యొద్దనున్న కాగితములవలన నీపై నపవాదదొలఁగి పోవును - నీశత్రువులు నశింతురు.

ఖా.—సర్కార్, నన్నట్లాశీర్వదింపుడు.

ఫ.—అచ్ఛా.

(అంతరంగమందిరములో)

ఆ.—రహిమాన్ అబీతగ్ నహీఆయా, బులావురే రహిమానుకు.

(ఖానుకాగితములతో ప్రవేశించుచున్నాడు)

అరే ఆయా? కాగితములిచ్చి నీకష్టమాయెను చెప్పుము. [కాగితము లందికొని] అరే ఇది మరియొకబాసలోనున్నది బులావ్ రే వసంతభట్టుకు జల్దీ ఆవ్.

[పరిచారకుఁడు నిష్క్రమించుచున్నాడు]

రహిమాన్ వీని నీ వెక్కడ సంపాదించితివి?

ర.—మదనసింగుపైఁ దమకుఁగల యాదరముఁ దలఁచిన నేమాడుటకు నోరాడకున్నది.

అ.—అరే, మదనసింగుకూడ కుట్రలోనున్నాడా? ఫర్మావై, బోలో.

ర.—మొన్న తమదర్శనముచేసి మఱలి పోవునప్పుడు వారియొద్ద నీకాగితములున్న సంగతి చారులవలనఁ దెలిసి వారినడ్డగించి యివి సంపాదించితిని. ఈసంగతి నే కాబోలు పురస్కరించికొని గిట్టనిదుర్మార్గులెవరో చాడులు గొట్టించుచున్నానని నాపై నపవాదఁ గల్పించిరి.

అ.—అరే, బేఖూఫ్, మదనసింగు నేలవదలితివిరా?

ర.—వాని నటుకుటకుఁగాను ఖడ్గమెత్తి యొకవ్రేటు వేసితినిగాని నాజరుజంగడ్డము పొచ్చి రక్షించినాడు.

అ.—అరే నాజరుజంగు, ఎంతద్రోహి వైతివిరా?

భా.—ఇందు ద్రోహమే మున్నది, హుజూర్, స్నేహమట్లు చేసినది.

(వసంతభట్టు ప్రవేశించుచున్నాడు)

వ.—ఆదాబ్! హుజూర్;

అ.—[కాగితములు చేతికిచ్చి] వీనింజదివి సంగతులు తెలుపుము.

వ.—[చదువుకొని అన్నిటిని అటుంచి ఒక్కకాగితమును మాత్రము చేతఁబట్టుకొని] తక్కిన వన్నియు కేవలక్షేమసమాచారద్యోతకములగు నుత్తరములు. ఇందు మాత్రము విశేషము గన్పట్టుచున్నది. ఇది దేవగిరి ప్రభువగు రామదేవు చిత్తూరురాణాయగు భీమసింగునకు వ్రాసినది. చదివిచెప్పెద చిత్తగింపుడు.

సీ. అసహాయశూరులై యవనగాంధార బా
    హ్లీక పారసిక మద్ర నృపుల నదిమి ।
కప్పముల్ గొనితెచ్చి కడిమి భారతలక్ష్మిఁ
    గైసేసిమించిన కమలకైర
వాప్తవంశజులగు నఖిలరాజన్యుల
    యసమునిల్పుచు శత్రువిస్తరమునకు
ప్రలయభానుండవై వెలయు నిన్నులయింప
    రాహువుపోల్ల నల్లాహుదీనుఁ

గీ. డేచి చిత్తూరిపై దాడి యేగనున్న
వాఁడనెడువార్త హృదయంబు గాడఁజొచ్చి
కలఁచుచున్నది చెయివెట్టి కదిపినట్లు
వీనిచే మును జేడ్పడి యేనునుక్క.

చ. నరవర యేమిచెప్పుదును నాప్రజదుర్దశ వీనిదాడికే
వెరవుననైన దప్పిచన వేఁయిముఖంబులబారి మోాలలక్ష

జోరు నసహాయులన్నమకి చూపరు నివ్వెఱగంద వ్రేల్మిడిం
బోరిగొనంజొచ్చి రిఖలుని పూన్కివహించిన తుచ్ఛదుర్భటుల్.

ఉ. క్రేపులు చన్నుద్రావ నఱికించెదు గోవుల విగ్రహంబులన్
గోపురముల్ గుడుల్చదిపె కోటికి మిక్కిలిఁ గాగ్రూరుఁడై
కాపురముల్చెడన్నడిచె కాంతుల కౌఁగిటనుండుకాంతల
న్నాపులఁజొచ్చి పట్టఁగ ననార్యతదూతలనంపిదుష్టులన్.

ఆసహాయుండ నయిన నాకుఁ గల్గిన యీాత నీక్షించి, పరస్పరసాహాయ్యంబు వలనిఫలము నపేక్షించి, ఈలేఖ మీతావునకంపికొంటిని. ఈక్రూరుఁ డెటుచూపి యెటు పోవునో తెలియరాదు. ముందు మిమ్ముముట్టిన మేమును మమ్ముముట్టిన మీరును దోడ్పడుట యవశ్య కర్తవ్యంబు. మనకుత్తరప్రత్యుత్తరము లఖిలనీతి విశారదుండగు నీ యోగివలన జరుగంగలవు. వీనిక్రూరతకురోసి వీనిపక్షమువారు గొందఱు మనలఁ జేరనున్నారు.

భవత్ప్రియసఖుఁడు.

రామదేవు.

అ.—అరే, అల్లా, ఈ దుర్మార్గు లెంతఁదలచుచున్నారు. సెబాస్ రహిమాన్, నీనీతికి మెచ్చితిని. నీమాటలు నచ్చినవి. మనపక్షమువారు కొందఱు వారిఁ జేరనున్నారు. నాజరుజంగందులోని వాఁడేయగు. వానిపూర్వుల స్వామిభక్తియు వానివంశము గౌరమునుఁదలంచిన వాని నేమి చేయుటకును జేయాడకున్నయది. కాని యీసంగతి మన చేతిలోనిది తరువాతఁ జూచుకొందము. నీవు వెంటనేబోయి యీయోగి యెవ్వఁడో కనుఁగొని సజీవునిఁగా బట్టుకొని రమ్ము. వాఁడు విచ్చలవిడి నుండ నింకనిట్టి కుట్రల కేమేమిరాయబారముల నడుపునో తెలియలేము.

ర.—సర్కార్, తమయాజ్ఞ యిదివఱకే నిర్వహింపంబడినది. మాగ్రామమున నొక గుహలోఁ గొంతకాలమునుండి యొక కపటయోగి వసించుచుండును. మొన్నమదన సింగాతని యింటనే విడిసినాఁడు. నేనాతని నే కాక యాతని ప్రియసఖుఁడగు నొక మాయిక మహమ్మదీయ మౌలవీనిఁగూడ బట్టికట్టి చెఱసాలనుంచినాఁడ. స్వామికార్యమందే నెపుడును జాగరూకుఁడ నయ్యేవర్తింతును.

అ.—అచ్ఛా, నారాజ్యమందలి మంత్రభారమిక్క నీ మూఁపున మోపినాఁడ. మన మిఁకజాగుసేయక కాఫరుమల్కాను రామదేవునిపై నంపి చిత్తూరిపై వెడల వలెను. నీవు వెంటనేపోయి సేనలనాయితంబు సేయుము.

ర.—[కొంతదూరముసాగి స్వగతము] సెబాస్, పక్కాయెత్తు బల్ ఖుసందుగా పడినది. ఒక్కదెబ్బతో నాతవాయిలనన్నిటిని గాచికొని, నవాబు మెహర్బానీనుండి నాజరుజంగును మదనసింగును క్రిందఁబడవైచినాను. దారులు గొట్టించినా నన్నుందులకుఁ జెప్పుకొన్న సంజాయషీతోఁడనే బావాజీని మాల్వీని చెఱఁబెట్టిన నేరమునుగూడ మాఫుచేసికొంటిని. నా తెలివి తేటలకు నసీబు కూడతోడయి యున్నది. ఇంతకు తులందరు ఫకీరు నోటివాక్యము కారణము. నావిజయమాతనికి విన్నవించి నాపనికిఁ బోయెద.

[నిష్క్రమించుచున్నాఁడు.]

వ.—[స్వగతము] ఉన్నవజీరునకే విచారించుచుండ వీఁడొక క్రొత్తవజీరూరుడ దాపరించినాడే. కాని చూచెదను. బుద్ధియెప్పటికిని వ్యర్థము గానేరదు.

[నవాబుసన్నిధికి జేరి.]

సర్ కార్, దీనికింత సంరంభమేల? నాకొక నెలదినములు గడువిచ్చిన, మీచిత్తమునకెక్క నానీతికౌశలము నెఱపి, చిత్తూరును యుద్ధములోఁ బనిలేకుండనే మీబందిఖానాకుఁ దెచ్చెద. నాఁడుమనవి చేసికొన్న నాటకము రేపటిదర్బారులో నడుపవేడెదను.

అ.—అచ్ఛా, రహిమాను ఖానేఖాను వసంతభట్టేభట్టు. అట్లేచేసెదను. నడిరేయిదాటినది పోయిరమ్ము.

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

---

## రంగము. 4.

---

### ఢిల్లీ దర్బారు.

[పాదుషా]వజీరు, నాజరుజంగు, మొదలగు సర్దారులును, వసంతభట్టు, రహిమాను ఖాను, సభ్యులును ప్రవేశించుచున్నారు.

అ.—

చ. పలుకులఁ దేనెలొల్కఁ బ్రభుభక్తి వమున్నతి వెల్లిఁ గొల్పుచుం
బలువిసమాత్రల న్నిలిపి మల్లుపాదం జరియించు త్రాచులుం

బల్లెకపటాత్ము లీసభను బల్వురు జేరిరి మేఁక వన్నె బె
బ్బులులను వారిఁ గైకొనెడిభూపతి కెయ్యెడ మోసమయ్యెడున్.

నానమ్మిన యోధవీరులలో నే యట్టివార లుండిరని తెలియవచ్చినది. అరె అల్లా! దొంగతనమునకును ద్రోహమునకును వాని వర్తనలతోఁ బనిలేదుగదా.

(సర్దారులందఱు నొండొరుల మొగంబులు సూచుకొనుచున్నారు.)

అ.—(నాజరుజంగు వంకఁదిరిగి) మోసమెన్నటికిని డాఁగనేరదు. నోరుదాచినను నొసలు బైటవెట్టును. నీగుట్టెల్ల నేఁటితో మాకు విశదమయినది. నీపెద్దల గౌరవమును బట్టి నిన్ను మిక్కిలిచేయ చేయాడదు. మాకొలువునుండిమాత్రము వీడ్కోలు వడసితివి.

నా.—సర్కార్! నా నేరమును నిరూపింపకయ నన్నేల నలయించెదరు?

అ.—నీ నేరము నీకుఁ దెలియకయే మాకుఁ దెలియవచ్చినదా? నిద్దురవోయిన వాని మేల్కొలుపనగుఁగాని మేల్కొని కన్ను మూసినవాని మేల్కొలుపువారుఁ గలరా?

నా.—సర్కార్! నేనేపాపము నెఱుంగను. నా నేరమును స్పష్టీకరించి నన్నేమి చేసినను దలయొగ్గదను.

అ.—అయేబత్కార్! ఇఁక పలుమాటలచేఁ గాలహరణము చేయక చెచ్చెర విచ్చేయుము.

నా.—ఇది మంచికి కాలముఁగాదు.

(లేచిపోవుచున్నాఁడు)

అ.—ఈసభ నింకను నిట్టి మహానుభావు లుండిరేని మమ్ముఁ బాసిపోయి యథేష్టముగా నుండ ననుజ్ఞాతులు.

వ.—కొలువున నీకోపచాపల్యములకుం బాత్రుండనై యింతకాలముఁ గడపితిని గాని యిఁకఁ గడప సాధ్యముఁగాదు. గుణదోష విహీనుఁడగు దొరను గొల్చుటకంటె బిచ్చమెత్తుకొని బ్రదుకుట మేలు.

అ.—అరే, లుచ్చా! తిన్నింటి వాసములు లెక్కించు పుటిలునకు నీ కీలాటి నోటి క్రొవ్వుఁగూడనటరా?, ఛీ! తులువా, తొలఁగిపొమ్ము. (పడఁదన్నుచున్నాఁడు) పోషించినయపరాధమునం జేసి నిన్ను ద్రుంచఁజాలను. కొలువు వాసిపోయి యిఁక నా కనులం బడకుము. లెమ్ము. పొమ్ము.

వ.—(లేచి దులుపుకొనిపోవుచు) కటకటా! నాపడినపాట్లెల్ల బూడిదల్లోఁబోసిన పన్నీటిచందమైనది గదా!

అ.—కాఫరులు మనలను వంచించి భంజింపఁ బలుకుట్రలుచేయుచున్నారు. వాని నన్నిటిని గ్రహించి మనరాజ్యమును రక్షించిన మహాపురుషుఁడీరహిమానుఖాను. నాజరు జంగును తొలఁగించి సేనాపతిత్వ మీతని మూపున మోపినారము. ఈతని కాజ్ఞానువర్తులై సేనానులందఱును ఫౌజులం గూర్చికొని ఎల్లి చిత్తూరిపై వెడల నాయత్తులయి యుండుఁడు. ఇంకఁబోయి మీమీ పనులు జాగరూకులయి నిర్వహింపుఁడు.

[అందఱు నిష్క్రమించుచున్నారు]

---

## రంగము. 5.

---

### ఆగ్రాపట్టణమున జయసింగుని యంతరంగమందిరము.

(చిదానందయోగియు జయసింగును ప్రవేశించుచున్నారు.)

జ.—స్వామీ! వందనము.

చి.—నారాయణ, నాయనా! హేమలత సుఖముగనున్నదా?

జ.—ఎవఁడురా హాజారమున?

పరిచారకుఁడు.—చిత్తము, స్వామీ.

జ.—హేమలతను బిలువనంపుము

(పరిచారకుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

స్వామీ! హేమలత యవస్థ నేమని విన్నవించెద? ఆమె హృదయసీమం బాదుకొని యున్న భావ విశేషంబు లించుకించుకఁగాని ఏర్పడ నిరూపింప నేర్పు చాలకున్నారము. అంతిపురంబున నొక్కింతయు నూరటఁ దోపమింజేసి.—

ఉ. పాడఁగ నెచ్చెలు ల్గనదుపాణి విపంచిని మేళవించి వా
దోడఁగ నంగఁ గైకొనదు, తోరపుఁబంజర రవారముల్
బాడదు కేల్చు లెత్తి, జోటివయస్యల నాదరించి మా
టాడదు, దుఃఖమూర్ఛిత మనోంబుజయు న్గిసతాన నాబ్జమై.

అంతనుద్యాన విహారంబుచేఁ గొంతవంతకుం దొలంగింతునని నెచ్చెలు లాపె నారామవాటికకుం దోడ్కొనిపోవుటయు, నట

వ. కల పిక కూజితంబులకు గాసిలు చిల్కల కూతకుల్కు బె
గ్గిలు నెలఁదేటి పాటలకు కెంజిగురు న్గనిగందు వేడివె
న్నెలఁ బడివాడు పయ్యెరకు నివ్వెఱఁ గందు విరాళిగూరి యా
చెలువ యవస్థకుం దెరపి చిక్కదొకప్పుడు నెందుఁజొచ్చినన్.

ఆ యింతికిట్లు పవనవిహారంబు ముల్లుబుచ్చి కొఱ్ఱుఁజొచ్చిన చందమైనఁ జెలులాపెం దోడ్కొని యిల్లుసేరుటయు నాప్త బంధు వియోగతాపం బగ్గలంబయి యలంచ,

ఉ. వారక పర్వ నార్పులను వాడెడిమెత్తని మేనుదీఁగ యా
హారముముట్టమిం గృశతనందుఁ గ్రమంబున సిందుబింబమో
నా రమణీలలామకుఁ గనంబడదేమియు చిత్తశాంతికి
న్నారు పథైన గల్గునె మనోవ్యథ కెందును మందుధాత్రిపై?

మీరుసెలవిచ్చిన ప్రకారము చిత్తూరిలో నామె యాప్తులయొద్దకుం బంపుద మన్నను వెంటఁగొనిపోవు వారు దొరకమింజేసి నామనంబెటులను పాలుపోకున్నది.

హేమలత.—(ప్రవేశించి) స్వామి! హేమలత ప్రణామంబుసేయుచున్నది. నెల పొడుపునకు చకోరంబులునుంబోలె నా నయనంబులు మీరాకకెదురు మాచుచు దిన మొక యుగముగాఁ గ్రమ్మరించి నేఁటికిఁగదా కృతార్థంబు లయినవి.

చి.—అమ్మా, సుఖంబా నీకు!

హే.—స్వామీ! తమ యాశీర్వచనంబులు ఫలించినఁ గదా మా బోంట్లిహపర సుఖంబులఁ గాంచుట?

చి.—అమ్మా! ఆపదల కోర్చినంగాక సంపద లెట్లనుభవింపనగు? నీకుం గోఁడనె శుభంబు గాఁగల్గదు. ఊరటఁగాంచుము (జయసింగువంకఁజూచి) ఓ ధీరచరితా! ఎల్లియో నేఁడో నీకే చిత్తూరుప్రయాణము తగులనై యున్నది. రాజనీతి కోవిదుండగు మీ నవాబు తన మంత్రమును గప్పిపెట్టి చిత్తూరుపై దండయాత్ర సంకల్పించితినని చెప్పిపుచ్చి తాను రహస్యమున సన్నాహము సర్వమును జేయుచున్నాఁడు. నీవు పోవునపుడు హేమలతను

వెంటఁగొనిపొమ్ము. ఈమె నపహరించికొని పోవ నీ పట్టణమున దుర్మంత్రము లెల్లెడల సాగుచున్న యవి.

హే.—హా దైవమా!

చి.—అమ్మా! ఇమ్మనుజ సింహుని పాలనున్న నిన్నావంచకమ్ము లేమి సేయం గలవు?

జ.—అమ్మా నాకంఠమున ప్రాణము లుండునంతవఱకు నీకు పరిభవం బెక్కడిది? వేలతనం బుడిగి యంతిపురంబునకుఁ బొమ్ము.

(హేమలత నిష్క్రమించుచున్నది.)

స్వామీ!

ఉ. సంగడికాని సర్వజనసమ్మత వర్తను నల్ల నాజరుం
జంగును గొండెముల్వాలికి చయ్యన జేనికిఁబాపెఖాను; దా
నిం గని భట్టుఁ డల్కమెయి నేఁడు దొలంగుట నాటకంబువో
లెం గనుపట్టు! నాతఁడు మలీమసచిత్తుఁడుఁ గాఁగఁదోఁచెడున్.

వానిం గడునకల్మషమానసుం బావనచరితుం గానెంచి తొలుత మైత్రివాటించితిం గాని నేఁటి వానిచందంబుఁజూడ నాకెంతయు సందియంబు వొడమెడిని; కాన వానికై యేని ననునయించుట నాకు కర్జంబుగాదని యెంచెద. ఇందలి ధర్మంబు నిర్ణయింప మీర దక్షులుగాన నానతీయ వేఁడెదను.

చి.—నాయనా! నీవంటి మహాత్మునకు ధర్మసంశయంబు వాటిల్లినం దీర్పఁహ రారులు గలరా?

చ. గహనము సూక్ష్మధర్మము జగంబునన్నైనను ధర్మనిష్ఠతా
మహిమ నిరస్త కల్మష సమంచిత చిత్తుల కంతరాత్మయే
మహిపయి ధర్మతత్త్వపు విమర్శనమందుఁ బ్రమాణమారయ
న్విహిత జగద్ధితాదరుల వేడ్కమె ధర్మముపల్కె వేదమున్.

సీ. అగ్నిసాక్షిగఁగొన్నయాలి నమ్మిన హరి
శ్చంద్రుఁడు ధర్మనిశ్చయ మెఱుఁగఁడె?
చెట్టుమాటునఁబొంచి చేరి వాలివధించు
రాముండు ధర్మాభిరక్షుఁడుగాఁడె ?

గురువధకై యుధిష్ఠిరుఁబట్టి బొంకించు
కృష్ణునకును ధర్మదృష్టిలేదె ?
ఒకపక్షముననిల్చి యొరులకుఁ దన్నిచ్చు
భీష్ముఁ డంచితధర్మవిదుఁడుఁ గాఁడె ?
గీ. వారి కన్నను ధర్మ విచారపరులు
గలరె? యెవ్వరైన నెందైన నలఘుచరిత?
సూక్ష్మ ధర్మపుత్రోవలు స్థూలదృష్టి
నెఱుఁగనేరమి యెఱుఁగరు హీనమతులు.

నాయనా! 'గజానాం పంకమగ్నానాం గజాఏవ ధురంధరాః' యన్నట్లు నీకు ధర్మసంశయంబు వొడమిన తత్సంశయ నివారణంబునకై నీకు నీయంతరాత్మయ యవశ్యాశ్రయణీయంబు. నాకనేక కార్యములు మించిపోవుచున్న యవి. నేఁ బోయివచ్చెద. హేమలతం దోడ్కొని పోవ మఱువకుము.

(నిష్క్రమించుచున్నాఁడు.)

---

6 వ. రంగము.

---

చిత్తూరునగరమున రాజాస్థానము.

[భీమసింగు లక్ష్మణసింగు ప్రభువులును, ప్రతాపసింగు గోరాసింగు, మదనసింగు లోనుగాఁ గల సర్దారులును పరివారము నాసీనులయి యుండ వసంతభట్టు ప్రవేశించుచున్నాఁడు.]

వ.—(దూరమున).

గీ. భీమసంగ్రామ సింహ యో భీమసింహ !
శరణు రిపుదళదళన దీక్షా విహారణ !
శరణు రిపుమౌళిమణి గణశాణ చరణ !
శరణు శరణాగతత్రాణ సాంద్రకరుణ !

భీ.—ఆహా ! వీరెవ్వరు గావచ్చును ?

ఉ. వేషము సత్వముట్టిపడ విప్రకులోచితమై యెసంగెడున్
భాషను సంస్కృతంబగుచు భాసిలు నీమహనీయుఁ జూచినన్
ద్వేషమువీడి సత్వగుణనిష్ఠఁ జరింపదె? లోకమెవ్వరే
దోషముసేసిరో?- యకట! దుర్మతులీతనికిం బ్రమత్తులై ॥

వ.—(సమీపమునకువచ్చి)

గీ. భీమసంగ్రామ సింహ యోభీమసింహ!
శరణు రిపుదళధళన దీక్షా విహారణ!
శరణు రిపుమహాళిమఃశిగణ శాణచరణ!
శరణు శరణాగతత్రాణ సాంద్రకరుణ!

భీ.—మహాత్మా, భయంబుఁదక్కుము.

ఉ. ధర్మము నాల్గుపాదముల ధాత్రిఁ బ్రతిష్ఠయొనర్చి యెంతయున్
నిర్మలచిత్తవృత్తిమెయి నేర్పున శిష్టులనాదరించి దు
ష్కర్ములనొంచి మించు జలజాత హితాన్వయమందు నొక్కరుం
డర్మిలి నేలు నీభువి ననార్యత నీకెవఁడేమి సేసెనో!

చ. తెలుపుము వాని కావరముఁ దీర్చెద నేళ్ల నడంగియుండిన
జలములడాగినం జదలఁజయ్యనఁ బ్రాకినఁ బట్టితెచ్చి యీ
నెలతలపూవుజోదు కరుణించి కృపామతిఁగావఁ బూనినం
జలమున శార్ఙ్గపాణి తనచక్రముచేకొని యడ్డుసొచ్చినన్.

వ.—నృపకులతిలకా! నీభుజాస్తంభంబు మాటుననున్న నాకేటికొఅంత? నావిన్న
పము నాలింపుము :—

సీ. ధరణి బ్రహ్మ క్షత్ర ధర్మనిష్ణాతులౌ
వర మహారాష్ట్ర భూసురుల లోన
జనియించి వేదశాస్త్రజ్ఞానమున మించి
యయ నయ కోవిదుండన రహించి

ప్రాయమును బలమును బ్రజ్ఞయు శీలంబు
క్రూరపాదుశాహునకు ధారవోసి
వానిధార్ష్ట్యమునకు వంగివంగియు సలా
ములుసేసి తిట్లుఁదన్నులును దినుచు

గీ. మనసు నేటికి విరుగ సామ్రాజ్య విభవ
రాజితుండవు శౌర్యధైర్య ప్రతాప
తేజితుండవు నినవంశ దీపకుఁడవు
నార్యధర్మ ప్రతిష్ఠాప నాంచితుఁడవు.

గీ. అనఘ నీకీర్తి నావీనులలర వింటి
అనఘ నీమూర్తి నా కన్నులారఁ గంటి
నేఁడునాపున్నములపంట నెరయఁగంటి
నిపుడు నీ పాలఁబడితి నే నింక మాటి.

గీ. అధిప యర్మిలిఁ జేపట్టి యాదరింప
వేని నీయాన యీామేనఁ బ్రాణములను
నిలుపనోపను శిఖి నొండె నీట నొండె
బడి విముక్తుఁడ నయ్యెదఁ బార్థివేంద్ర.

భీ.—(స్వగతము) ఆహా! అనర్థమువచ్చినదే; అల్లాహుద్దీనుతో సంధిచేసి కొంటి మిగదా! (ప్రకాశముగా) అల్లాహుద్దీనుని నిగ్రహింపవల్ల పడదు. ఆమాటయేల? మీకుఁ గావలసినది మాయనుగ్రహమేకాని యొరులనిగ్రహముఁ గాదు గదా? దానికేమి కొఱంత; మీరు మా యాస్థానమున యథేచ్ఛముగనుండి మీకుండోఁచిన రీతిని మంత్రతంత్రముల కష్టం బోద్పడుచుండుఁడు.

వృ.—దేవా.

గీ. శత్రు శిబిరాగతుండగు మిత్రుఁనైన
నరసి చేకొనవలయు నయ్యదియుఁ గాక

అతివినయమెంచ ధూర్త చిహ్నంబటండ్రు
రదియు నిటఁదోఁచుఁగాపున నరయవలయు

భీ.—ఓయుదారచరితా ! నుకకీ వేడసందియంబులతోఁ బనియేమి ?

సీ. కావఁడే శరణార్థి గాఁ దన్ను జేరిన
రిపుసోదరుని రామనృపవరుండు ?
కావఁడే తనమేని కండఁగోసి యొసంగి
పావురంబును శిబిక్ష్మావరుండు ?
కావఁడే ప్రియమిత్రుఁ గమలాక్షు మార్కొని
తనుఁజేరు గయుని బృథాసుతుండు ?
కావఁడే రిపుఁడైన కాళియోరగు వాని
భార్యలుఃశరణన్న వాసుదేవుఁ ?

గీ. డవని శరణాగతులఁ బ్రోచు నవసరముల
వెనుక ముందును జూడరు వీరవరులు;
దీనరక్షా పరాయణ దీక్షఁజేసి!
యభయమిచ్చెదు తటి శంకలనఘ! యేల ?

వ.—దేవా భవత్ప్రసాదంబున ధన్యుండనైతి.

మ.—నరపాల శేఖరా.

గీ. మిన్ను విఱిగిపడిన మేదిని గ్రుంగిన
వార్ధి వేలఁదాఁటి వసుధముంచె
నేనిఁ గొంకు జంకు నించుక పొడమదు
రాజపుత్ర హృదయ రంగములను !

నృపకుల తిలకా! తాత్కాలిక స్ఫురితంబగు ధర్మసందేహంబు తీరనంటిని గాని రాఁబోవు నపాయములకులికి పలికిన వాఁడనుగాను. 'రాజాను మతో ధర్మ' అను నట్లు సర్వధర్మ విదురలగు దేవరవాక్యములచే ధర్మము నిర్మలదృష్టింగంటి. (వసంతభట్టు వంకఁజూచి) అయ్యా తమ నామధేయమేమి ?

వ.—నా పేరు వసంతభట్టందురు.

మ.—దేవా! మీయను గ్రహంబునకుం బాత్రంబగు నీవసంతభట్టింతటినుండియు నాకెల్ల రకుం బ్రియమిత్రంబు.

[తెరలో వైతాళికుఁడు]

మ. జలకంబాడఁగ హేమకుంభములతో స్వచ్ఛాంబువు ల్వింతఁగా
కలశంబు ల్వెసగూర్చి క్లాంతివశతం గాశేయ చేలాంచలం
బులు జారం బయికెత్తినట్టి కనకంపుంగిండ్లునాఁ జన్గవల్
వెలిఁదోపం బసమించిరంగనలు పృథ్వీనాథ! స్నానావనిన్.

భో.—ఆహా! సహస్రాంశుఁ డంబరమధ్యము నలంకరించెడిని;

చ. వలభులఁబాసి చేరె నదె పావురము ల్భవన ద్రుమంబుల
న్నెలఁగెడుఁ దమ్మినీడల నిమీలితనేత్రములై మరాళముల్
కల పిక కూజితంబులను గ్రాలెడుమందిమ కొంత భాస్కరుం
డ లఘుతర ప్రతాపమున నంబరమధ్యమున న్వెలుంగెడున్.

ఇంకం గొలువుచాలించి యభ్యంతరమున కేగవలయును.

[అందఱు నిష్క్రమించు చున్నారు.]

ఇతి.

# హేమలత.

## తృతీయాంకము.

### రంగము. 1.

[చిత్తూరులో వసంతభట్టు బాహ్యమందిరమున దీపము ఎదుట వెలుఁగుచుండఁగా తన కుర్చీమీఁద కూర్చుండియుండును.]

వ. [స్వగతముగ] ఆహా, రాజపుత్రుల దేవబ్రాహ్మణ భక్తి సంశయమను నదెటుంగదుగదా; అందును భీమసింగు పరాకాష్ఠ కృతయుగచర్యను స్మరణకుఁ దెచ్చుచున్నది. లక్ష్మణసింగునకు నాయెడల కేవలశిష్య ప్రపత్తియే కుదిరినది. ఇట్టి వీరి హృదయక్షేత్రముల నా తంత్రావాపములు మొలకలెత్తి చక్కఁగా కొనలు సాగుటకు, పానకములోని పుడకవలె, మదనసింగొకఁడడ్డముఁగా నున్నాఁడు. కాని నేనాతని యుద్వాసనకే యెత్తు గడ నేసి, యేలికల యంతరంగముల నేటి కాతనియెడలం గొండొక యనాదరంబు పుట్టింపఁ గలిఁగితిని. నాయెడల భక్తి తాత్పర్య ఘనములగు ప్రభువుల హృదయసీమల నాతని వినయ వివేక శౌర్యధైర్యాద్యుదార గుణసంపత్తి కంఠీభూతమై పోవుటంజేసి యాతండు రాజాస్థానమునకు రాకపోకలు సంక్షేపించికొని యథోచితంబుగ నున్నవాఁడు. చిరసహితంబగు నాసంకల్పంబుగూడ నేఁడు ఫలోన్ముఖంబయినది. నీతికాళలమన్న నిట్లుండవలదా? 'ఏకాక్రియాద్వ్యర్థకరీ' యన్నట్టు లొక్క ప్రయత్నముచే నభీష్టసిద్ధియు విపక్షశిక్షయుఁ గూడ సంఘటించితిని. కాని యెంతచెడినను బ్రాహ్మణపుట్టువగుటంజేసి యట్టి సౌజన్య శీలురకుం గృతఘ్నతఁ దలంప మనంబు దలంకుచున్నయది. అయినను 'సంశయాత్మా వినశ్యతి' యను భగవద్వాక్య మైహికాముష్మికముల రెంటను నమోఘంబు.

మ. ప్రభుసత్కార పరాయణంబు జనసంప్రార్థ్యాఖిల శ్రీయశో
విభవాది స్థితిశోభితంబునగు పృథ్వీభారనిర్వాహక
త్వభరం బిచ్చలఁగోరు మాదృశ సుధీవర్యోత్తమ శ్రేణికి
యుభయ భ్రంశక ధర్మసంశయము లీయుర్విం బరిత్యాజ్యముల్.

కావున నిట్టి పెడసందియంబుల కెడమియ్యక నావలలోఁ జిక్కిన లక్ష్మణసింగుం గొంపోయి కానుకఁగా నొసంగి చక్రవర్తి మంత్రిత్వపదవి నే నేకాపోశనంబుగాఁ గొనియెద. ఇందుకు సందియంబుండదు. లక్ష్మణసింగు బాలుఁడగుటచే నాతని పినతండ్రి భీమసింగు ప్రతినిధిగాఁ బ్రభుత్వము నెఱపుచుండు నేకాని, జ్యేష్ఠవంశజుఁడగు లక్ష్మణసింగే రాజస్థానమునకుం బ్రధానప్రభువు. ఈతనింబట్టి తొలఁగింతుమేని రాజస్థానమెల్ల ఛిన్నమూలమగు చెట్టునుంబోలె వాడి యెండిపోవును. నిరాయాసంబుగ నిట్టి యభిమతం బొనగూర్చు నాకుం జక్రవర్తియొసంగని దేమున్నదను? కాలచక్రము దిరుఁగుచున్నయది. నడికిరేయి యాసన్నమయినది. కాని,

క. అవివేకుల కెయ్యది నిశ
పవలది యౌ వివేకులకును, బవలెయ్యది యా
నవివేకులకది నిశయగు
నవని వివేకులకు, బుద్ధినారయ నెందున్.

ఆహా! భగవద్వాక్యము లైహికాముష్మికముల రెంటను సమన్వయము లగుచున్నవే. ఇంతేల? లోన వివేకదీపము వెలుఁగుచుండఁ బైచీకటి లెక్కేమి? ఇఁక జాగుసేయక నాఘోరకృత్యమున కేనుపక్రమింపఁబోయెద.

[కత్తి చేతఁబట్టుకొని నిష్క్రమించును]

---

## రంగము. 2.

---

### చిత్తూరులో ఆనందమఠము.

[చిదానందయోగి యోగనిష్ఠ చాలింపఁ బోవు సమయమునకు మదనసింగు ప్రవేశించుచున్నాఁడు.]

చి.—(కూర్చుండ సైగచేయుచున్నాఁడు.)

మ.—(ఇంచుకసేపు కూర్చుండును.)

చి.—[నిష్ఠచాలించి] నాయనా! ఏదో పనిమీఁద వచ్చినావు?

మ.—స్వామీ! అగతానాగత వేదులగు తమకుం దెలియని దుండునా? దేశాంతరమున నాకుంగల కొందఱి యాప్తుల యోగక్షేమముల నారయుంగోరి మీసన్నిధిం జేరినాఁడ.

చి.—(కొంతతడవు ధ్యానించి) నీయాప్తులన నంధుఁడగు నొక వృద్ధుండును, ఒక యెల ప్రాయంపుఁ బూఁబోడియు నేకదా?

మ.—స్వామీ! తమకుం దెలియనిదేమి? వారియోగక్షేమములను సెలవిండు.

చి.—వారొండొరులంబాసి యాపద్వార్థిలో మునింగి యున్నారు. ఇంకనుం గొంతకాల మిడుమలఁగుడిచిన పిదప వా రాపదలఁగడచి సౌఖ్యంబులం బడసెదరు. వారల ప్రకృతావస్థకు నీచేనగు ప్రతిక్రియలేదు. విధిఁగడువ నెవ్వరివశంబును గాదు. సర్వ ధర్మవిదుండవగు నీకింక విస్తరింపం బనిలేదు.

మ.—వారి సేమమునకు భంగముండదు గదా స్వామీ?

సదాశివుడు (బహిర్ద్వారమున) జయ్ క్షీరసాగరశయనా.

చి. (మదనసింగుతో) అందులకు సందియంబువలదు. ఇదె వచ్చెద, నించుక సేపు నిలువుము (పోయి తలుపుఁదెఱచి) సదాశివా! ఏమీ యవేళవచ్చితివి?

సదా.—స్వామీ! వసంతభట్టును బాహ్యమందిరము ముంగల జాజిపొదమాటునఁ బ్రొద్దుఁ గ్రుంకినప్పటినుండి జాము రాత్రివఱకును దామోదరుఁడును నేనును, బొంచియుంటిమి. ఖడ్గపాణులగు నిరువురు మువ్వురు భటులుమాత్రము వచ్చుచుఁబోవుచు భట్టుతో నెద్దియో భాషించిపోవుచుండిరి. వారి వైఖరి యెంతయు సందేహాస్పదముగా నున్నందున మేము చీమచిటుకన్నను జెవులు దొరగించుకొని వినుచుంటిమి. వారుపోయిన వెనుక వసంతభట్టుతనలో తానేమో మంతనంబు సేసికొని ఖడ్గపాణియై పురోపకంఠోపవనవాటి వైపునకుంజనియె. ఆతనిమాటలలో 'భీమసింగు' 'లక్ష్మణసింగు' అనుమాటలొకటిరెండు సార్లు వినవచ్చినందున వారిపై నేమికుట్రలు సాగుచున్నవోయని సందియంబు వొడమి, దామోదరుని భట్టు వెంటనంపి, ఉన్నది తమకు విన్నవింప నేనిటవచ్చితిని.

చి.—అహా! ఈమధ్య లక్ష్మణసింగుభట్టునకు భృత్యప్రాయుఁడై యున్నాఁడు. ఆతనికేమి కీడుమూడునో కదా దైవమా! సదాశివా! లోనికిపోదమురమ్ము. (లోనికిఁబోవుచున్నారు.)

చి.—నాయనా! మదనసింగూ,

మద.—చిత్తము, స్వామీ!

దామోదరుఁడు (పరువెత్తికొనివచ్చి లోనికిఁజొచ్చి) స్వామీ! ఏమి చెప్పుదును?

ఉ. వానకు నెండకోర్చి మనవన్నియు వాసియుఁ దూలపుచ్చి యే
న్యూన మొకైనఁ బాలుపడి యొండు విచారములెల్లఁ దక్కి—ల

నూనినభక్తిఁబూనిన ప్రయోజనమెల్లను జెల్లె నేఁడయో!
ఈవఁగఁ గాచి నక్కలకు నిడ్డతెఱంగయి పోయెనక్కటా!

చి.—దామోదరా, పాసఁగిన దోసఁగేమి? ఇంచుకశమించి వివరింపుము.

దా.—మనలక్ష్మణసింగను కంఠీరవమును వసంతభట్టు మొదలగు వంచకములు వంచనచే వలకు దిగిచి పట్ట నుంకించుచున్నయవి. నిముసమునిల్చిన కార్యంబు దప్పెడు. వాలు కేలంగొని నావెంట విచ్చేయవలయు.

న.—దీనికిందలు కావలెనా? నీవు దారిపెట్టుము నేనొక్కరుండ నరుదెంచి యా వంచకములఁద్రుంచి మన పంచాననంబును విడిపించెదను. స్వామీ! సెలవొసంగుడు పోయి వచ్చెద.

చి.—నాయనా ఇంచుక తాళుము. [యోచించి] నీ నిజరూపమును వంచించి పోవుటెందుకయినను మంచిది. అసిపుత్రిని మాత్రము కేలనుంచి యన్యంబులగు క్షత్రియ చిహ్నంబులడించి, యీభస్మంబు నుదుటనలందుకొని రమ్ము.

మ.—[క్షణమాత్రమున నట్లొనర్చి] స్వామీ! ఇంక జాగేల? [ముందంజ వేయుచున్నారు. అందఱును వెంటఁ జనుచున్నారు.]

---

## రంగము. 3.

---

### పురోపకంఠోపవనమున నొకవిహారభవనమున వెలుంగుచున్నయొక దీపము ముంగల.

[లక్ష్మణసింగును వసంతభట్టును ఆసీనులయియుండ, మదనసింగు చిదానందయోగి సదాశివ దామోదరులును భవనమున కించుక దూరమునఁ బ్రవేశింతురు.]

చి.—[వసంతభట్టు లక్ష్మణసింగుల వంక వ్రేలుచూపి] ఆహా! లోకరక్షకుఁడు మన పాలనున్నాఁడు. ఆరత్నదీపమును మఱపించుచు మన రవికుల ప్రదీపుఁడల్లదె కన్నులపండువుగా వెలుంగుచున్నాఁడు. ఆతనిచేతఁ గత్తియుంగలదు. ఎదుటనున్నవాఁడు భట్టొక్కఁడె. ఇప్పటికి మించునదిలేదు. కావున మనమీ చేరువయారంబు పొంత నించుకసేపుఁ గాంచియుండి యాఖలుని హృదయకాకోలము వెలిఁబర్వునంతయుఁ దెలిసికొందము.

[అందఱు నట్లుచేయుచున్నారు.]

లక్ష్మ.—[వసంతభట్టుతో] మదనసింగింతటి కుటిలాత్ముఁడని కలనైనం దెలియ నైతినిఁగదా. వాండ్రెన్ని దినంబులనుండి మాపైని కుట్రలకై యేకాంతమంతనంబులకిటఁ జేరుచుందురు?

వ.—దేవా, కడచినవారములో వారి ననుదినమును నిశీథపువేళ నిటఁ గనిపెట్టుచునే యుంటిని. వాండ్రు వచ్చుసమయమా సన్నమైనది. వాండ్రసభ సాగినతోడనే మన కుఁదెలుపందగు చారుల నిలిపియున్నాను. కుడువఁబోవు కూరరుచి వేఱ తెలుప నేల? అచిరంబుననే మీ కంతయు కరతలామలకంబు సేసెద.

మ.—[యోగితో] వింటిరా స్వామీ? ఈతులువపలుకులుఁ గూడఁ బూవులం బొదివిన ములుకులవలె దుర్భావగర్భితములై కర్ణకఠోరములుగాక యహృదయ మర్మములను భేదించుచున్నయవి.

చి.—నాయనా, తుణమోపికపట్టి, కుంచము నిండనిమ్ము. నేనుఁజయకాళీ, అని సంజ్ఞయొసంగినతోడనే నీవు నీపనికిఁ గడంగుదువుఁగాక.

ఆనందుఁడు.— [లక్ష్మణసింగుకు వెనుకగాఁ బ్రవేశించి, వసంతభట్టుతో]-అందఱును సమావేశ మయినారు స్వామీ; ఇఁక మీపనియే అవశిష్టముగా నున్నది

వ.—మీరందఱు నాయుధసన్నద్ధులరయి యున్నారా?

ఆ.—దేవర యాజ్ఞానుసారము.

ల.—[స్వగతము] వీరల వేషభాషలు చూడఁజూడ నాకనుమానాస్పదములుగఁ దోఁచుచున్నయవి. కానిమ్ము, కేలవాలుండ భయంబు నాకేల?

(వసంతభట్టు ఆనందునకు సైగసేయ వాఁడు వెనుకనుండి లక్ష్మణసింగుచేతి కత్తి నొడిసి పట్టఁగమకించుచున్నాఁడు)

చి.—'జయకాళీ' [అనఁగనే మదనసింగు శరవేగమునఁ జేరఁబారి యానందుని భుజమునఱుకఁ గత్తి యెత్తువఱకు]

చి.—(సదాశివ దామోదరులతో) ఓరీమీరిట వేచి యుండుఁడు. [అని శీఘ్రమున భవనము ప్రవేశించి తలుపుమూయును]

భవనములో:—అక్కటా! క్షత్రియధర్మమెట్టి క్రూరకర్మమునకైన నొడఁబరుపఁజాలునుగదా! కటకటా! చేసేత బ్రాహ్మణహత్య చేయవలసివచ్చినదే!

(సదాశివ దామోదరులు రోజుచుఁ బరువెత్తికొనివచ్చి భవనద్వారమున నిల్తురు.)

స.—"జయ్, క్షీరసాగర శయనా."

చి.—[తలుపుఁదీయుచు, లక్ష్మణసింగుతో.] కుమారా, ఇదేవచ్చెద నించుకసేపు వున్నింపుము.

ల.—చిత్తము. నేను [సదాశివ దామోదరులఁజూపి] ఈవచ్చువారల పని చక్కఁజేసివచ్చెద. [అనిసాగి దూరమున నేలమీఁదపడియున్న రెండు కత్తులలో తనకత్తిని గేలఁ బూనుచున్నాఁడు.]

చి.—[సదాశివ దామోదరులఁజూపి, లక్ష్మణసింగుతో] నాయనా, వీరన్యులుఁగారు. ఇందిపుడొరులెవ్వరునులేరు. ఆవేశమునుడించి యించుక యాలకించిన నంతయు గోచరించును.

సదా.—అయ్యా! మీరులోనికిఁబోవుచుండ నెవ్వరోమువ్వురు ఖడ్గపాణులై వచ్చి, మీ సంరంభమును దూరమునుండి చూచి వెఱఁగుపడి "ఆహా! మనగుట్టు బైటఁబడ్డదే. లక్ష్మణసింగు మనల వంచించి సపరివారముగానే వచ్చినాఁడు. రమ్ము మనమైనం బ్రాణములు దక్కించుకొని పోదము" అని పరువెత్తఁజొచ్చిన మేము వారివెంటనంటితిమి. కొంత దవ్వుసని నిలిపియున్నయొక్క గుఱ్ఱపు బండినెక్కి వారు తప్పించుకొనిపోయిరి. మేమంతట మఱలి వచ్చితిమి.

దామో.—స్వామీ, తమకిదివఱకు విన్నవించికొన నవకాశము చిక్కినదికాదు. నేను వసంతభట్టు వెంటఁ దోటలోనికి మొదట వచ్చినప్పుడు లక్ష్మణసింగును ఖైదీగాఁ గొనిపోవనున్నట్లు బండిమీఁదివాండ్ర గుజగుజలవలన విని, అందులకుం దార్కాణంబుగా విహారభవనంబున మనయేలికయునికియుంగని, ఆసన్నమైన యాపద గ్రహించివచ్చి చెప్పితిని. ఆపైసంగతియెల్ల స్వామివారికి విశదమేకదా?

ల.—[యోగినిజూచి] స్వామీ కొదవకథ తమరు సెలవియ్యవలెను.

చి.—నాయనా, ఏమున్నది! నిన్నుఁబట్ట నుంకించుచుండిరను వీనిమాట చెవినిఁబడఁగనే నీరయిన హృదయమును చిక్కఁబట్టి, నేను శిష్యులగు వీరిరువురను, అప్పటికి దైవయోగమున మాయొద్దఁజేరియున్న బ్రహ్మక్షత్ర విద్యావిశారదుండగు నీమహాపురుషుని, వెంటఁగొని, ఇచ్చటికొక్క పర్వునవచ్చి నిన్ను సురక్షితముగాఁజూచి ధైర్యముఁ దెచ్చికొంటిని. వసంతభట్టు వంకఁజూపి ఈఖలుని హృదయమందలి విసము వెలిఁగ్రమ్మ నంతయుఁదెలియఁగోరి యాయారంబు పొంతఁ బొంచియుంటిమి. కొంతసంభాషణ సాగువఱకు

[వసంతభట్టు వంకఁజూపి] ఈక్రూరుని కనుసన్న [ఆనందునిఁజూపి నాఖలుఁడు వెనుక నుండి నీకేలవాలు నొడియం గమకించుచున్న నే 'జయకాళీ' యని సంజ్ఞయిచ్చినంతనే ఈమహాపురుషుఁడు వాని [ఆనందునిజూచి] భుజమూలంబుఁ దెగనేసి, యొరనుండి కరవాలంబు వెలుకుచున్న మాయాశీలుండగు [వసంతభట్టునిజూపి] నీబ్రాహ్మణబ్రువుని కేలొడిసి పట్టి నేలకుందిగిచెను. అంత నీవీతనిపై ఖడ్గమెత్తితివి. ఆవిషమసంధిలో గత్యంతరములేక యీమహాపురుషుఁడీ బ్రాహ్మణ బ్రువినిఁ దెగనటికి నీఖడ్గమునకుం దనఖడ్గమెదురొడ్డిన రెండును బెడిసి నేలఁబడినవి. మీరుభయులు నిశ్చేష్టితులయియుండ నింకమసలిన నేమిపాకముదప్పునోయనుభీతిచే నేను నీయెదుటఁ బడితిని. నీవును నన్నేర్పటించి యొకటిరెండు మాటలాడుకరి కీసదాశివునిమాటవిని నేఁదలుపు దీయుటయు మొదలుగాఁగల వృత్తాంతము నీవెఱింగినదే కదా?

ల.—స్వామీ! అంతయు నే నెఱింగితిఁగాని, ఈమహాపురుషు నెఱింగింపఁ వేడెద. [ఈమహాపురుషుని వంకఁదిరిగి] మహాత్మా! వ్యామోహమున నేఁజేసిన యపరాధమునకు నన్ను మన్నింపవేడెదను. నీచేసిన ప్రాణరక్షణకై నా ప్రాణతుల్యమగు నీఖడ్గముం బారితోషికంబుగా నిచ్చెదఁ బరిగ్రహింపుము. [కత్తి నాతనిచేతి కిచ్చుచున్నాఁడు.]

చి.—[లక్ష్మణసింగుతో] నాయనా, నీకీ నాటకమందలి యాథార్థ్యమొంటఁ బట్టినఁదాక నీకీ మహాపురుషునిం దెలుపుటుచితముగాదు. తెల్లవారవచ్చుచున్నది. మనమింక నిటఁదడయుటుచితముగాదు. [అందఱును నిష్క్రమింపఁ బోవుచుండఁగా] నిముషము నిలువుడు. [వసంతభట్టు దెసకుఁజేరి] వీనియంగిలో నీ కర్కోటకుని యంతర్వ్యాపవ్యాంజకములగు లేఖలుండకపోవు. [అని వెదకి యందున్న యొకయుత్తరమును సేకరించి] రండుపోదము తెల్లవార వచ్చుచున్నయది.

[అందఱును నిష్క్రమించుచున్నారు.]

## 4-వ రంగము.

### చిత్తూరులో — ద్వారము.

[భీమసింగు లక్ష్మణసింగు ప్రభువులును, ప్రతాపసింగు, గోర్సింగు, మదనసిం... గారు గాఁగల సర్దారులును, పరివారమును ప్రవేశింతురు.]

లక్ష్మి.—మహాజనులారా! నిన్నటిరేయి జగద్రక్షకుఁడు మనపాలనుండుటం జేసి నాకొక గొప్పగండము గడచినది. ఆచిత్రకథ కన్నులారఁ జూడవలెనుగాని వీనులవిని గ్రహింప శక్యముఁగాదు. వసంతభట్టువంటి గోముఖవ్యాఘ్రమును మన మొండెడం గని విని యుండము. మదనసింగు మొదలయినవారు మాపైఁ గుట్రలు పన్నుచున్నారని కల్పించి చెప్పి మా మనసులు విఱిచి తనవశము చేసికొని నిన్నటి యర్ధరాత్రమున వారినిబట్టి యిచ్చు నెపమున నన్నూరి వెలుపలి యుద్యానమునకుం గపటంబునఁ గొంపోయి, ఒంటరిగాఁ జిక్కించుకొని బందిగ్రాహముచేసి, యంచెలమీఁద దాఁటించికొని పోవఁజూచినాఁడు. మన చిదానందయోగియు మఱి యొకమహాపురుషుఁడును సకాలముగ నీ సంగతుల గ్రహించి యచ్చటికేతెంచి, పొదమాటునఁ బొంచి మామాటలు వినుచుండిరి. నన్నుఁ బట్టుకొనుటకు సమస్తమును సిద్ధమైన తోడనే, అమ్మహాపురుషుఁడు నాపాలిదైవమువలె నడ్డుసొచ్చి భట్టును వానిభటునిఁ దెగటార్చి యాదురాత్ములు శత్రులో మిత్రులో యేర్పఱింప నేరమిం గర్తవ్యతా విమూఢతనున్న నన్ను రక్షించి తన్నెఱింగింపకయ పోయినాఁడు, కాని

క. ఆ పలుకులు నా లీలలు
నా పలుకులఁ దోఁచునట్టి యౌదార్యము లో
లోపల వేమఱు దలఁచిన
నా పురుషుఁడు మదనసింగో యని తోఁచుమదిన్.

చిదానందయోగి.—(ప్రవేశించి మదనసింగుని యొరనుండి కరవాలంబు వెలికి లక్ష్మణసింగునకుఁజూపి) బాబా, ఈ ఖడ్గమెవ్వరిదో గుర్తింపఁ గలవా?

ల.—(ఖడ్గమును గైకొని మదనసింగుని సన్నిధిఁజేరి). నాప్రాణరక్షణచేసిన యీ మహాపురుషునకు నా ప్రాణతుల్యమగు నీయసిపుత్రిం బారితోషికంబుగా నొసంగితి నన్న సంగతి కథాప్రసంగంబున విశదీకరింప మఱచితిని.

మ. ప్రళయార్కద్యుతి ధామమా, రిపుతమిస్రాకృత్పరిభాస్తోమమా,
ఖిల న్యాయారవప్రాణమాటఁ దగుదీవే కాన్కగాఁ జేయ నీ
యలఘుప్రాభవ వైభవోన్నతికి. నార్యా! ప్రాణసంరక్షకుం
గలదే నిష్క్రియ మీయసింగొనుము దీనన్నాదుసౌభ్రాత్రమున్.

(అని కత్తిని చేతికిచ్చి కౌఁగిలించి కొనుచున్నాఁడు.)

మా.—క. ఈ యొడ లీప్రాణంబులు
నీయవియే కావె దేవ! నేఁ జేసినదే
మీా యల్పంబౌక ఘనముగఁ
జేయుట తగుగా కుదార చిత్తుల కధిపా!

భీ.—(మదనసింగువంకఁ దిరిగి) ఓ యమలచరితా! మిత్రభేద తంత్రపారీణుండగు వసంతభట్టుని మిథ్యోపదేశంబునఁ దథ్యంబు దెలియక నీ యెడల మేముచేసిన యపోహా వజ్ఞలకు మమ్ము మన్నింపవలయును.

మ.—ప్రభువు లింతవఱకుఁ జెప్పవలయునా? దేవా! నాప్రభుభక్తి ప్రకటించి కొన నవకాశము లొదవించుటకుఁగాను దైవయోగంబున సముపస్థితంబులైన యీాపరీక్షల కింత సందియంబు వొంద నేల?

ల.—(చిదానందయోగిని దోడ్కొనివచ్చి యున్నతాసనంబుననిల్పి). వీరు కేవలము మనపాలి దైవములు. మనల నుద్ధరింప నీరీతి నవతరించినవారు. పాదప్రణామంబుకంటె వీరికి మనముచేయునదిలేదు. (పాదములఁ బడుచున్నాఁడు. భీమసింగుకూడ పాదప్రణామము చేయుచున్నాఁడు).

చి.—రవివంశశేఖరులారా! ఇదియిట్టి యుపచారములకు సమయంబుగాదు. ఇప్పటికి జగద్రక్షకుఁడు మన పాలనున్నాఁడు. ధర్మశీలుర కెప్పుడును దైవసాహాయ్యంబు సిద్ధంబుగావున, ముందును మనకెట్టి లోపంబును గలుగఁబోదు. కాని మ్లేచ్ఛులు మనల నెంత కనుఁగప్పి వ్యవహరించుచున్నారో, నిన్న రేయిఁ దెగటారిన యీావంచక బ్రాహ్మణుని యంగీనుండి నే సేకరించిన యీాజాబువలన నంతయు విశదమగును. ఇది మ్లేచ్ఛ భాషలోనున్నది. బాగుగఁ దెలిసిన వారెవ్వరేని దీనిం గైకొని చదివి చెప్పుఁడు.

గోరాసింగు.—(యోగిసమ్ముఖమునఁజేరి) స్వామీా, నాచేతికిండు. చదివి తెలియఁ జెప్పెద. (చదివి చెప్పుచున్నాఁడు.)

ఢిల్లీచక్రవర్తి వసంతభట్టునకు వ్రాయునది:—మేము దండయాత్ర వెడలి నేఁటికి జయపురము చేరితిమి. నాలుగైదు దినములలో చిత్తూరు చేరుచున్నాము. రేపు లక్ష్మణసింగునుబట్టి పంపెదనని వ్రాసినందున కెంతయు సంతసించితిమి. ఆతనిని మార్గ మధ్యమున మాశిబిరము చేర్పవలసినదే కాని ఢిల్లీకిఁ గొంపోవ నక్కఱలేదు. సాధ్యమయి నంతవఱకు నీవు మఱలక పూర్వము మదనసింగు పనికూడఁ జక్కఁజేసి రావలెను. స్వా

ముందు మకాము లేరోజున వారోజు వేగుల వాండ్రవలనఁ దెలియఁగలవు. మన దండయాత్రను గుఱించి రాజపుత్రుల కనుఁగప్పియుంచు విషయములో జాగరూకుఁడవయి యుండవలెను.

అల్లావుద్దీన్.

శా. మోసంబయ్యెఁగదా దురాత్ము నొకవిప్రున్నమ్మి సర్వంబు నుం
జేసేతం గొని తెచ్చికొంటిమని మాచిత్తంబు నొచ్చుంగటా!

(సింహాసనముపై నొరుగుచున్నాఁడు)

(లేచి) —

ఈసుద్దుల్గతవారిసేతురచనల్ హృత్తాపమున్మాసి వే
ధీసంపత్తిని భావికార్యగతి నిర్దేశింపఁగాలంబికన్!

కావున నోదండనాథాగ్రణులారా!

చ. పరఁగ నపావృతంబయిన స్వర్గపుద్వారము క్షత్రకోటికిం
దుర మది దైవసంఘటనఁ దోడనె చొప్పడుచొప్పఁదోఁచె సం
గరమునఁ గెల్వ రాజ్యమునుఁ గాయము వీడిన స్వర్గమబ్బును
ర్వ్వర నెటులయిన రాజులకుఁ బండువు గాదె రణంబుచూడఁగన్ !

చ. ఇన శశి వంశ శేఖరు లహీనపరాక్రమశాలు రిట్టి మి
మ్మని మొన నోర్వఁగా హరిహరాదులకైనను గాదు కార్య మిం
కను గడుమేరమించుటయుఁ గానము కావున మీరు రాజ్యర
క్షణకుఁ గడంగి మీదు భుజగర్వ మఖర్వము గాఁగఁజూపుడీ.

ఇంకం గొలువు చాలింతము. మీరు రేయుంబవళ్లు ప్రయాసచేసి సేనల నాయితంబుసేయుఁడు.

(అందఱు నిష్క్రమించుచున్నారు)



# హేమలత

## చతుర్థాంకము.

### 1. రంగము.

చిత్తూరుకోట యెదుట అల్లాహుద్దీను డేరాలో.

అల్లా.—మేమీకోటను ముట్టడి వెట్టి వారము రోజులయినది. నిన్నటి రేయి, మొన్నటిరేయి, రాజపుత్రు లదరిపాటునఁ బయింబడి మాసేనలఁ జెండాడుటయేకాని మాకు విజయావకాశము లించుకయుం గానరావు. కాఫరుమల్కాను రామదేవు పయి నంపియు నాజరుజంగును గొలువునుండి తొలఁగించియు మేము రెండు గొప్ప తప్పిదములు చేసితిమి. ఖానువాకుశూరుఁడే కాని ఖడ్గశూరుఁడుఁ గాడు. ఇప్పుడు మా సేనానులలో పెన్నఁదగిన వాఁడొక జయసింగు గానుపించుచున్నాఁడు. అరే! ఎవఁడురా హజార మున! రహిమానుఖాను, జయసింగులోనుఁ గాఁగల సర్దారులను బిలుచుకొని రమ్ము.

(పరిచారకుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

ఆహా! రాజపుత్ర యోధులందలంచిన గుండె నీరగుచున్నది.

ఉ. అక్కట యుక్కుతున్కలు రణాంగణమందు మన రాజపుత్రులో
కొక్కఁడ వేవురం దరిమి యుద్ధతిఁజంపెడు నిట్టిచందమే
నెక్కడఁ జూడ! నిత్తెఱఁగునే డ్డెర నూపిన నిల్వశక్యమే?
పెక్కుదినంబులాయె నొకబెల్లునురాలదు కోటగోడలన్.

జయసింగు.—(ప్రవేశించి) సమరవిద్యావిశారదు లగుటంజేసి తమ కిది యెల్లం [illegible]బయినది. మనవారలింకను మహాభ్రాంతిలో నున్నారు.

రహిమాన్‌ఖాన్.—(ప్రవేశించి) వీని మాటలకేమి, వీరిమగంటిమి మన మెఱుంగ [illegible] ఇట్టివారు దర్బారుఁ దీర్చినప్పుడు సభాలంకారముగాఁ దలపెట్టఁ దగినవారు [illegible]మరావసరంబులం గార్యాలోచనంబునకుఁ బిలువందగినవారు కారు. సర్కార్! [illegible] జూచెదవు, గాక! ఈ ముక్కడి మూకలం గూల్ప మన [illegible] సాహాయ్యంబేల? నేనొక్కరుండన పేర్చి,

చ. కదనమునందు బిట్టొరసి కాఫరుమూకలఁ గ్రందఁదోలెదం
గతువుల వేల్పు గోపకునికైవడి లావును జేవఁ జూపి దు
ర్మద రిపుగర్వ భంజన సమగ్రపరాక్రమశీలు నన్ను నీ
వు దయఁ గ్రహించి చేసిన యపూర్వపుమన్నన రిత్తవుత్తునే?

జయ.—యథార్థమాడితివి. ఆడినవాఁడ వాడినట్లుండక తిరిగియేల త్రోవఁ దప్పితివి? సమరావసరంబులం గార్యాలోచనంబునకుఁ బిలువం బ్రభుసమ్ముఖంబునం బ్రజ్ఞలు వెలయింప నీకు సములు లేరు. అంతియఁగాక ఖడ్గంబునూసు నీకేల?

చ. చిక్కనిపోటుమానిసివి సీ! నినులోకులు నవ్వ నేటికీ
పెక్కులు బీరముల్వలుకఁ? జేర్చిన శాత్రవసేన ముంగలన్
దిక్కఱి సిన్న మొన్న నతిదీనత నుండుట లింతలోన నీ
కక్కట! విస్మృతింబడెనె? యందఱిలో నిటులాడుకొందురే?

అ.—దండనాథాగ్రణులారా! చాలింపుడీ యాలంబు. ఈలీల నొండొరులతోఁ గయ్యంబునకుం గాలుద్రవ్వుట కిది కాలంబు గాదు. పాలును నీరునుంబోలె మీరిరువురును గలిసియుండిన నాకుంగార్య ఖడ్గంబులఁ గొఱంత యుండదు. ఇంకం గాలవిలంబనంబు సేయక సేనలంబురికొల్పుకొని కోత్తలుసేసి లగ్గలు వట్టుఁడు. నేనింతలోపల సమరసన్నద్ధుండనయి వచ్చెద.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

## 2-వ రంగము.

---

[చిత్తూరుకోట కుత్తరమున మైలుదూరమున పారిపోవుచున్న మహామ్మదీయ సైన్యములో వెనుకఁబడిన యొక మహమ్మదీయుఁడును, ఒక క్షత్రియుఁడును బ్రవేశింతురు.]

క్షత్రి.—అమ్మా! మదనసింగు బలంబుల మఱల్చికొని కోటముఖంబు పట్టినాఁడు. గుండెలదర నిఁకఁ బరువిడ నక్కఱ లేదు.

మహ.—అరే, భాయి! నన్నుకూడా కలుపుకొని పొమ్ము.

క్ష.—రమ్ము పోదము; ఏల వెనుకఁ బడితివి?

మ.—ఈపనిలో మీ రెప్పుడును ముందు మే మెప్పుడును వెనుక నే; చాలు చాలు. దీనికి మమ్మా క్షేపించాలీ ఓయ్ ?

తు.—ఈమాటల కేమి ; ఇఁక కట్టిపెట్టు; మీ సర్దారు పౌరుషమిదివఱకే లోకములోఁ బ్రాకినది. సిగ్గులేక యింకేలఁ బ్రేలెదవు ?

మ.—అరే, భాయ్, వాఁడిక గాజులు దొడిఁగించుకుంటె మాకీయేమీ ఓయ్? అరే అల్లా, ఈరోజు నాజరుజంగే సర్దారుగానుంటే మామజా తెలుసును. ఖాన్ఖవట్టిఫాజీ. వాని చెప్పడు మాటలు విని నాజరుజంగును కొలువునుండి తొలగించి నవాబింత సేస్కున్నాఁడు. అయినా నవాబుకు చివరకత నే దిక్కయినాఁడులే. మదనసింగు నవాబు పైకి తన తురికీ సురికించినప్పుడు నాజరుజంగే అడ్డు సొచ్చి రక్షింపక పోయినయెడల అల్లాహుద్దీను పని బిస్మిల్లా అయ్యేదే !

తు.—నాజరుజంగు మదనసింగుకు స్నేహితుఁడ టే ? అతఁడెట్టు మదనసింగును దాకినాఁడు ?

మ.—అయితే నేమి? ప్రభురక్షణ చేయవలసివచ్చినప్పు డతఁడు వారు వీరని దాక్షిణ్యముఁ దలఁచునా? అందుకే కొలువునుండి తొలఁగింపఁబడియు నాతఁడు నవాబు వెంట వచ్చినాఁడు.

తు.—నాజరుజంగడ్డము సొచ్చినప్పుడు మదనసింగైన వెనుదివిసెనా?

మ.—మదనసింగును నాజరుజంగువంటివాఁడే. అతని కతండెసాటి. నాజరుజంగునుదాకి ఘోరయుద్ధము సేసినాఁడు. కాని సమమయి పోయి కత్తి నేలవైచి నాజరుజంగును గాఁగిలించికొన్నాఁడు. వారిరువురు నేమేమో బాసలాడుకొని ఎవరి తెన్నున వారు మఱలిపోయినారు. ఈకథ కేమిగాని మంచి సర్దారుని బెట్టుకొని తూరుపు బురుజు దాకి మీరు సేసిన ఘనకార్య మేమోయ్?

తు.—పడమటి బురుజు దాకి మీసర్దారు పిరికి పందయై చెడఁగొట్టినాఁడు. తూరుపు బురుజుఁదాకి మాసర్దారు పోటుబంటైచేటు దెచ్చినాఁడు. అని మొన్న నిల్చి యెంత బ్రతిమాలినను వెనుకకు రాక యాతఁడు యుద్ధారంభముననే గూలినందున మామూకలు విచ్చిపోవలసి వచ్చినది. ఇరుదెసల నిట్లు తెరపి చిక్కిన ప్రతాపసింగు గోరాసింగులచే నడుపంబడిన రాజపుత్ర సైన్యములు చుట్టుముట్టి సింహద్వారమ్మందు మదనసింగుని సంరంభమున కదివఱకే యోహాటించుచున్న నవాబు మూలబలంబులం బొదివిన నవియు మనతోట్టి

పాటు మఱల వలసివచ్చినవి. మనబలములు చాలదూరము సాగిపోయినవి. తొందరఁగాఁ బోదము రమ్ము.

(నిష్క్రమించుచున్నారు.)

## 3-వ రంగము.

[చిత్తూరుకోటకు మఱలిపోవుచు మార్గమున మదనసింగును మఱియొక రాజపుత్రుఁడును ప్రవేశింతురు.]

ఉ. పున్నమ చందురుందెగడు మోమున వెన్నెలఁ గేరు పిన్న న
వ్వెన్నఁగరాని చెల్వుఘటియింపఁగ నవ్వసఁ జేరు నీతఁడా
క్రొన్ననవింటివాఁడో నలకూబరుడో యమరేంద్ర సూతియో
కన్నులఁజొక్కఁజేసి యొడికంబుగఁ జిత్తము వే హరించెఁగా!

(ఆతని సమీపించి.)

కుమారా! మున్ను నిన్నెయ్యెడనో చూచినట్లయ్యెడు. నీ కులవృత్తాదులును స్థలంబును వినిపించి నా వీనులకు విందొనర్పుము.

రా.—నాకుల వృత్తాదుల నా వేషభాషలు చెప్పకయే చెప్పెడు. నా పేరు కుమారసింగందురు. నాయావాసం బాగ్రాపురంబున కనతిదూరంబుననున్న యొక గ్రామము.

మ.—(స్వగతము) ఈతని వైఖరి హేమలత రూపరేఖావిలాసములం బుణికి పుచ్చుకొన్నట్లున్నయది. అడిగి చూచెదంగాక. (ప్రకాశముగా) “సఖ్యమ్సాప్త పదీన ముచ్యతే” అను న్యాయముంబట్టి నాకు నేస్తంబవయితివి. ఆ చనవున నేఁజేయుప్రశ్నంబులకు మన్నించి సదుత్తరంబు లీయవేడెద. ఆగ్రాపట్టణ ప్రాంతముననున్న పాలీయను గ్రామంబున వసించునొక బావాజీపాల హేమలత యనునొక కోమలాంగి గలదు. నీ వాపె నెన్నండేనిఁ గని విని యుందువే!

రా.—ఆపెయు నేను నేక గర్భవాస జాతులము. సర్వకాల సర్వావస్థలయందు నొక్కదేహమై మెలంగుచుండియుఁ గాలకర్మగతిచే నా దివ్యమంగళవిగ్రహము నటుడించి నేనిటుల రావలసి వచ్చినది. ఆపెయు నీ వీడు చేరెనని వినివచ్చి యెచ్చోఁబరికించినను నాపె జాడఁగాననైతి. ఇంకను రోయ వలయుతావులుఁ గలవు. అందరయం బోయెద.

మ.—నేస్తమా, నేఁగూడ వచ్చెదరమ్ము.

రా.—నీ కామెపై నేల యిట్టి యాదరము? ఆమె నీ కేమైనం గావలయునది యా ?

మ—(సలజ్జముగా) మైత్రియేకాని బాంధవము లేదు.

రా.—బాంధవాపేక్షయు నీ వైఖరియందుఁ బొడసూపుచున్న యదిగాని నీ హృదయమందున్న యపేక్ష యామె హృదయంబున నుండునో లేదో ? నా కనుజ్ఞ నొసంగుము నేఁ బోయివచ్చెద. ఆమె యున్కిఁగాంచి వచ్చి రేపకడ నీకుందెల్పెదను సెలవిమ్ము.

[నిష్క్రమించుచున్నాఁడు.]

శా. రూపంబల్లదె మోహనంబు, నడతీరు న్రాజహంసోచితం
బాపాటంగను పట్టు, కోకిల వధూవ్యాహార రమ్య స్వరం
బాపొల్కి న్వినవచ్చు, నచ్చుపడునాహా ! సర్వముంజూడఁగా
నీపుణ్యాత్మునియందు హేమలత తీరీచిత్రమేమో కదా!

ఆహా ! కలఁగని మేల్కని నట్లయినదే. ఆతఁడు హేమలత సహజన్మండనని చెప్పినాఁడు. హేమలతకు సోదరులుండిరన్నమాటయే విని యుండకయు నప్పుడా దివ్యమూర్తి స్మారిత హేమలతా ప్రచారుండనై కర్తవ్యంబు మఱచి వివరంబడిగి కనుఁగొననైతిని. ఇందేమైన నిక్కవంబుండునా ? అక్కటా ! ఎక్కడి నిక్కవము? 'యద్భావం తద్భవతి' యన్నట్లు.—

చ. జ్వలదనురాగవహ్ని నిద్రవంబగు నాహృదయంబులోన ని
శ్చలముగ హత్తు హేమలత చారుతరాకృతిఁ దాల్చియుండుట్ల
వెలుపలఁ దోచు వృత్తులు నివృత్తములైన యనుక్షణంబ నా
కిలఁదిలకింప సర్వమును హేమలతామయమై యెసంగెడుఁ.

ఆహా ! ఏమో కుడికన్నదరుచున్న యది. యోగివాక్యము లసత్యములు గానేరవు. భావిభాగ్యం బసంభావ్యంబు.

[అని సాగుచుండ నెదుటఁ బడియున్న యేనుంగు కళేబరంబు మాటునుండి వెలువడి రహిమానుఖాన్ మదనసింగున కెదురుపడి నిశ్చేష్టితుఁడై తుదకుం దెల్విఁదెచ్చికొని.]

ర.—శరణు శరణు మహాప్రభూ! దీనుఁడను దిక్కుమాలినవాఁడను, శరణు చొచ్చితి, నాయపరాధముల క్షమియించి నన్ను రక్షింపవేఁడెదను. మీ పెల్ల తూట్లుపడినది.

నాబ్రదుకింకను నిశ్చయముగాదు. అభయమిచ్చినదాక నేనీ పాదములపైనుండి లేవను. [అని పాదములఁ బడుచున్నాఁడు.]

మ.—కటకటా! నీకీగతి పట్టినదా? రాజపుత్రహృదయములు దిక్కుఁజెడి శరణు చొచ్చిన దీనులయెడ, హింసాక్రౌర్యములకుం జోటువెట్టునా? భయంబుడుఁగుము.

[అని లేవనెత్తుచున్నాఁడు.]

ఖా.—మహాప్రభూ! అల్లానీకు దీర్ఘాయు వొసంగుఁగాక.

మ.—పాపము! మావారి శరాసారంబు పెల్లున వీని వీపెల్ల జల్లెడయైనది. వెన్నిచ్చిన వానిం దాకఁ గూడదన్న విచారము, రాజపుత్రుల కేఁగాని, వారి విల్లువీడిన బాణముల కుండునా? ఎదుర్కొని నిల్చినచో వీనియవస్థ యింతకంటె మేలుగనుండుఁ గదా.

[చెంతనుండు భటులనిర్వురం జేరఁబిల్చి] వీడు ప్రాణసంశయావస్థలో నున్నాఁడు. మీరు వీనిని వ్రణచికిత్సాగారంబునకు శీఘ్రింబ గొంపొండు.

[అందఱును నిష్క్రమింతురు.]

---

## 4-వ రంగము.

### చిత్తూరు-ఆనందమఠము.

[చిదానందయోగి యోగనిష్ఠఁ జాలించువఱకు భీమసింగు లక్ష్మణసింగులును, ప్రతాపసింగు గోరాసింగులును పరివారమును బ్రవేశించి ప్రణామము సేయుదురు.]

చి—సర్వాభీష్ట సిద్ధిరస్తు! నాయనలార, సుఖాసీనులు గండు.

(అందఱును లేచి యాసీనులగుదురు).

భీ-శా. ముల్లోకంబుల మీయను గ్రహమునం బొందంగ రానట్టి సి
ద్ధుల్లేవారయ నెట్టి దుర్ఘట సముద్యోగంబుల న్హేలమై
డిల్లీనాథునిఁ దోలు భాగ్యమొగిఁ గంటిన్నేఁడు గా శాంతి సం
ధిల్లెన్నా మది రాజ్యముం దిరపడె న్నిష్కంటకంబై కడున్.

[మదనసింగు ప్రవేశించుచున్నాఁడు.]

మ—స్వామీ, మదనసింగు ప్రణామము సేయుచున్నాఁడు.

చి—నాయనా, నీకు సర్వశుభంబులును జేకూరుఁగాత!

మ—మహాత్మా, మీయాశీర్వచనంబులు ఫలించినంగదా మాబోంట్లకు శుభంబులు చేకూరుట.

(కుమారసింగు దూరమునుండి ప్రవేశించును.)

చి—ఏమీరాజ పుత్రుఁడు హేమలతరూపు పుణికి పుచ్చుకొన్నట్లున్నాఁడు?

మ—స్వామీ, మీకుఁగూడ నిట్లు తోచుచున్నదా?

(కుమారసింగు చిదానందయోగి సన్నిధికేఁజేరి.)

కు—వందనమో యార్యా!

ఉ. కాలము దప్పివచ్చిన నకల్మషశీలము మానము న్వెసం
బాలికకోటికి పాల్పఱచి బన్నము నొందకయుంట నేర్పుమై
స్త్రీలోకవేళఁ బౌరుషముఁ జిత్తములందున వేషభాషలం
దాలుచు టెల్లభంగులను ధర్మమె కా న క్షమింపవేడెదన్.

చి—అమ్మా! అల్ల యభ్యంతర భవమునఁగల వల్కలములతో నుచితవేషమును గైకొనిరమ్ము.

[హేమలత లోనికిఁ బోవుచున్నది.]

మ—స్వామీ, అనుజ్ఞ ఇచ్చినఁ బోయివచ్చెద.

చి—నాయనా, హృద్గతంబగు నీప్రశ్నంబున కుత్తరంబు నేఁ జెప్పకయ సముపస్థితంబయినది గదా. ఇంక నీవు ధైర్యంబవలంబించి ఇచటుక నిలువుము.

హేమలత—(ఉచితవేషముతో మఱల ప్రవేశించి)స్వామీ హేమలత ప్రణామము చేయుచున్నది.

చిదా—సౌభాగ్యవతీభవ! తల్లీ, సప్రాణవై చేరితివా?

ఉ. మానధనుండు క్షత్రకుల మండనమూర్తి యనాథదీనసం
త్రాణపరాయణుం డభయదానమహావ్రత దీక్షితుండు నా
ప్రాణసఖుండు నీయనుఁగు రక్షకుఁ డాజయసింగు గూలఁగా
మ్లానలతాగ్రసూనమయి క్రమ్మందకయుంటివె నాదుభాగ్యమా!

హేమ—స్వామీ, ప్రారబ్ధశేషమున్నంతవఱకును బ్రాణులకుం బ్రాణహాని యెక్కడిది.

ఉ. తల్లియుఁ దండ్రియుం జనిన దైన్యమహాబ్ధి ని మగ్నయైన న
న్నల్లవితాను రక్తిమెయి సాకినతాతయు నీడ, నార్తిమై
యుల్లము తల్లడిల్ల బెగడొందెడు నాకభయంబొసంగె రా
జిల్లెడు ప్రేమ; నట్టి జయసింహుఁడు బోయినఁబోవు ప్రాణముల్.

శా. చూడంజుట్టము మ్రొక్క దైవమును నెచ్చోఁజొచ్చిన న్నిల్వఁగా
నీడంగానక యార్తి పెల్లునఁగడు న్దీనాత్మనై యింక నే
కీడుల్పొడఁగఁ జూడ నిల్చితిని! నాక్లేశాబ్ధికి న్నేరయే
నాడుంగల్గునొ కల్గదో! కృప నను న్గావంగదే ధీనిధీ!

చి—అమ్మా మన్మనోరథంబులు ఫలించినవి. నాయజ్ఞాత వాసదీక్షతీరినది. ఇంక నసుందెల్పు కొనందడయు నేటికి? తల్లీ యూరడిల్లుము.

ఉ. ఎవ్వని నింతదాఁక జగమెల్లగతాసుఁడుగా దలంచెనో
ఎవ్వని నిట్టివేషమున నీవును తాతయు నేర్పరింపకే
దవ్వులఁ బుచ్చి నెవ్వగలఁదద్దయుఁ బ్రొద్దులు పుచ్చుచుంటిరో
యవ్విధిపాలితుం దెలియుమా నను నీగురుఁడగాఁ గృశోదరీ.

హేమ—ఆహా! ఏమీయదృష్టము-ఇది కలయా నిక్కమా? తండ్రీ యేమిపుణ్యముచేసితిని? [అని కౌఁగిలించి కొని పరవశయగు చున్నది.]

చి-అమ్మా శాంతింపుము. [చెంతను గూర్చుండఁబెట్టుకొని, తేర్చి.]

శా. తల్లీ! నిన్నును రాజ్యము న్రిపులదుస్తంత్రంబులం దూల్చినేఁ
డుల్లాసంబున బొందగంటిని మదీయోద్యోగము ల్నేఁడు వ
ర్థిల్లె న్జన్మము ధన్యమయ్యెను మహాదేవ ప్రసాదంబునన్
ఫుల్లాంభోజేక్షణ నీమనోరథ మికం బూరించుటొప్పున్వెసన్.

హేమ—హా తాత! ఎట్టిదురవస్థ పాలైతివి!

చి—అక్కటా! ఎక్కడితాత, చింతలం జివికిన యాశరీరమునం బ్రాణము లింకను నిలువనిమ్మెక్కడిది?

[నారాయణసింగును నేల్వట్టి నడిపించుకొనుచు మాల్వి ప్రవేశించుచున్నాఁడు.]

చి—ఉ. బెబ్బులినోటి కండగతి వెల్వడిరా వెరవెట్లు తండ్రి! నీ
కబ్బెను ఖానుబారి ననపాయతఁ దప్పిసవారు గల్గిరే?
ప్రబ్బిననాదు పున్నెమిటు పండెనొ యేమొదలంచి చూడఁనా
కబ్బురమయ్యె దైవకృప నబ్బని మేల్గలదే ధరిత్రిపై?

[అని కౌఁగిలించు కొనుచున్నాఁడు.]

[హేమలతయు కౌఁగిలించుకొనుచున్నది.]

నారా—నాయనా నన్ను విడువుము; నిప్పచ్చకాడను. నాకీ జన్మమున నొకండు తండ్రీయని కౌఁగిలించికొను భాగ్యముఁ గూడనా?

చ. కొడుకులఁ బొట్టఁబెట్టుకొని గ్రుడ్డితనంబునఁ గుందుచాపదల్
గడుకొని శల్యశల్యమునఁ గాడగ నాటియు మన్మరాలికై
యిడుముల కోర్చి ప్రొద్దులటు లెక్కిటొ పుచ్చుచునుండ నాపెయుఁ
బడియెఁ గిరాతువాత ననుఁ బాయవు ప్రాణము లేమి పాపమో!

చి—తండ్రీ, సుకృతములు ఫలింపకుండునా? ఆపదలు కాపురము నేయునా? పరమేశ్వరుని కటాక్షమువలన మనకిప్పుడేమిటం గొదవలేదు. మీకింతవంతకుం గారణభూతుండనగు నేను నాఁడాయుశ్శేషముకల్మిచేఁ దలవరులం బ్రసన్నులఁజేసికొని తప్పించుకొని పోయి, ఈవేషమునం బ్రచ్ఛన్నవృత్తిఁ జరించుచు, మీ క్షేమము నొకకంటను రాజపుత్రరాజ్యక్షేమము నొకకంటను గనిపెట్టుచు, నాటి రాత్రి మహాక్షోభంబునుండి హేమలతం దొలంగంగొంపోయి యాపె నాగ్రాలో నల్లాహుదీను సేనాపతిగానున్న యుత్తమక్షత్రియవంశశేఖరుండగు జయసింగుపాలనుంచి వచ్చితిని. జయసింగాపెను శిబిరంబునకు వెంటఁగొనివచ్చి రణంబునంగూలిన, నిదె యాపెయు నింతకు మున్న నాపాలఁజేరియున్నది (హేమలతచేయి నారాయణసింగు చేతిలో నుంచును.)

హే—ఏ మీ దైవకృప? శుభంబులపై శుభంబులు పేరుచున్నవి.

నారా—[మాల్వీని జూపి] ఈమహానుభావుఁడే మనపాలిటి ప్రత్యక్షదైవము. ఈతనికృపంజేసియే నేను మిమ్ముఁజేరు భాగ్యము లభించినది.

మద—[మాల్వీ యొద్దఁజేరి] వందనమో మహానుభావా!

మా—సమస్తమంగళానిభవంతు!

మద—(మాల్వీని భీమసింగునకుఁజూపి) దేవా, మనలకు చిదానందయోగి యొక యెత్తును ఈమాల్వీ యొకయెత్తును సుడీ.

భీ—వందనమోమహాత్మా! మీయుదారశీలమెల్ల మదనసింగుకలన వినియున్న మాకు తమ దర్శనలాభముచే నేఁడెంతయు శుభదినంబయ్యె:

మాల్వీ—ఓయుదారచరితా, ఇదియెల్ల నీ మిత్రపక్షపాత ఫలముగాని వేఱొండుఁ గాదు.

భీ—మహాత్మా, మీరు మారాజస్థాన మంత్రి సంఘము నలంకరించి మాకు మంత్ర తంత్రములందోడ్పాటొసంగ ననుగ్రహింపవేడుకొను చున్నాఁడను.

మా—ఓయుదారచరితా నీ యభీప్సితంబెల్ల భంగుల నమోఘంబు గదా.

భీ—(నారాయణసింగు జనార్దనసింగుల వంకఁ దిరిగి) మహానుభావులారా, మదన సింగువలన మీవృత్తాంతము విన్న నాటనుండియు, నాహృదయము కుదురుపడక తల్లడిల్లు చున్న యది. నేటి కీశ్వరకటాక్షముచే నదృష్టకాలము సముపస్థితంబైనం గొంతెల్ల దీఱఁ గంటిమి; కాని మదనసింగు మనోగతమైన ప్రశ్నంబును మీరు పూరింపవలసియున్న హేమలతా మనోరథమును తెలియం గౌతూహలంబు వొడమెడు. కావున ననుగ్రహించి యానతియ్య వేడెదను.

చి—నాయనా, మదనసింగునాఁడు వ్రణచికిత్సకై మా తండ్రియొద్ద నుండఁగా, నాతనికి హేమలత యుపచారము చేయుచుండు తఱి, వీరొండొరుల యెడ బద్ధానురాగు లయిరి. ఇట్టి యనురూపదాంపత్యమును సంఘటించుట యొక్కటే మనకు స్పృహణీయ మైన కర్తవ్యముగా మిగిలి యున్నది.

భీ—మహానుభావా, సిద్ధసంకల్పులరగు మీయాశీర్వచనములకుం బ్రతిహతంబుం డునా? మీరుభయులును మాకిలువేలుపులై మాగృహపావనంబు సేయుచుండ వాగ్దానము సేసి, హేమలతనస్మత్పుత్రికారత్నంబుగ స్వీకరించి యామె వివాహమంగళమునకు సకల సన్నాహమును జేయింప నాకనుజ్ఞ యొసంగవేడుచున్నాఁడను. ఇందులకుం బ్రతాపసిం గును సంతోషపూర్వకముగాఁ దనసమ్మతి నొసంగు వాఁడు.

ప్ర—ప్రభుచిత్తము మహాప్రసాదముగాఁ గైకొనుచున్నాఁడను.

నారాయణసింగు జనార్దనసింగులు—తథాస్తు.

[అందఱు నిష్క్రమింతురు.]

---

## 5-వ రంగము.

రాజనగరములో నొక మందిరము.

[నారాయణసింగు జనార్దనసింగులు ఆసీనులై ప్రవేశింతురు.]

నా— క. అపకృతులనెల్ల, నీశ్వర
కృపకల్మిని దూల్చి రిపులఁ గెల్చితి మిద్ధా
త్రిపయి "స్త్రీ వస్వభ్రా
ణోపస్కృతి" యనంగ నెంత నిక్కమయ్యెన్.

జ.— తండ్రీ, యుక్తకాలము వచ్చినంగదా పురుషకారము ఫలించుట.

ఉ. కాలము క్షేత్రమౌ పురుషకారపు బీజములంకురింపఁగాఁ
గాలమఖండ వృష్టియగుఁ గామిత సస్యము లుల్లసిల్లఁగాఁ
గాలము దోహదంబు ఘనకర్మ సముచ్చయము ల్ఫలింపఁగాఁ
గాలము భేషజం బవని గాఢమనోరుజల న్హరింపఁగా.

ఉ. కాలరహస్యవేదుల కఖండ శుభంబులుఁ గూరు; దీన శ్రీ
కాలవశమైన లేదు; గతకాలము మేలనువార్త కల్లయౌ;
కాలమున న్జడుండు నిజకర్మ ఫలంబులెనందుఁ గావునం
గాలము కర్మముఁ న్మహిని గారణముల్మహాని వృద్ధులన్.

[హేమలతా మదనసింగులు పురోహితునితో ప్రవేశించి, నారాయణసింగు పాదములకుం బ్రణమిల్లుదురు.]

జనా— తండ్రీ, వివాహమంగళానంతరము, గృహప్రవేశమునకై, ప్రస్థానోచిత సన్నాహంబు సర్వంబును సిద్ధంబైన, వధూసమేతుఁడై మదనసింగు మీయాశీర్వచనంబు గైకొనవచ్చి ప్రణమిల్లుచున్నాఁడు.

నా— సమస్తమంగళానిభవస్తు; ఆచంద్రార్కం వంశాభివృద్ధిరస్తు!

మ. శివశర్వాణులు, శారదాబ్జభవులు శ్రీవిష్ణులు న్వశ్వదు
ద్భవ దవ్యాజ నవానురాగలహరీ స్వచ్ఛాంతరంగంబుల

న్నివులంగూర్పఁగఁ బూవుఁదావియుఁ బలెన్నెయ్యంబు నిండార ను
త్సవమొప్పంభజియింత్రుగా తధరపై దాంపత్య సర్వస్వముల్ !

కాంచనంబునరత్నఁబు గదిసె నేఁటి
కహహా! మెచ్చంగవచ్చు నయ్యభవునాజ్ఞ
నదియ కలదేని భువినసాధ్యంబొకండు
గలుఁగ నేర్చునె యెంతేసి కార్యములను?

మద.—మహాత్మా,

మ. ఋషికల్పుల్కరుణా మహోదధులు నిర్ణిద్ర ప్రభావాంచితుల్
ధిషణాదేవగురూపముల్కడు దయార్ద్రీభూతచేతస్కులై
విషమావస్థలఁ ద్రోచి కాచి వరముల్ప్రీతిం బ్రసాదింపఁగా
మృషగానోపునె? పండవేసుకృతముల్? వృద్ధుల్వెసన్నిండవే?.

జనా.—వత్సా నీభక్తి వినయంబు లంతయుం బ్రశంసనీయంబులు.

ఉ. ఆర్యమవంశ మండనుఁడవై యసహాయత నద్వితీయదో
ర్వీర్యము నీతికౌశలముఁ బెంపెసలారఁగఁ జూపి నేర్పునం
గార్యము ఖడ్గము న్నెఱపి కాంచిన నీవిజయంబు లీక్రియం
బర్యవసింపఁజేయు ననవద్యమహత్వము నీక చెల్లెడున్.

పురో.—ప్రస్థానలగ్న మాసన్నమయినది. ఇంకం గాలవిలంబము సేయక రండు.

మద.—మహాత్ములారా, పోయి వచ్చెదము. అనుజ్ఞ యొసంగ వేడుచున్నారము.

సా.—శుభము పోయి రండు.

ఉ. చింతలు దీరె సౌఖ్యములుఁ జేరె మనోరధముల్ఫలించె నేఁ
డంతయుఁ భద్రమై శుభదమై తనరారియు మోహపాశము
ల్వంతలఁగూర్చు వింతఁగను వారకయైహికసౌఖ్యసంతతిం
జింతయు బీజభూతమయి చేరియెయుండుఁగదా సదాభువిన్.

హేమలతా, పోయివచ్చెదవా.

శా. తల్లీ! సద్గుణకల్పవల్లి! నిను నాధారంబుగాఁ బూని ప
క్షిల్లెం బ్రాణములా మహాపదల నాదేహంబులో, నంత సం
ధిల్లెన్వాంతలు నాహృదంతరమున న్నివ్వాసియిన్నాళ్ళు, నేఁ
డుల్లాసంబుఘటిల్లియుం గలఁచునీయుత్కంఠ మత్స్వాంతమున్.

హేమ—

శా. ఢిల్లీనాధుని దోర్బలాప్తుఁగల మేటిం గూడి యుల్లాలనై
యుల్లాంబ్రజెల్లరు నాయదృష్టమిలపై నెంచంగ విఖ్యాతి రా
జిల్లంగల్గిన మోదమబ్బియును నాచిత్తంబు చిత్రంబు రం
జిల్లంజాలదు మిమ్ముఁ బాయు కతనం జింతాభరాక్రాంతమై.

[అనికంటఁ దడిపెట్టుచున్న యది.]

జనా.—అమ్మా, హేమలతా!

శా. ధీరస్వాంతవు వీరపత్నివి లసత్తేజోనిధానాత్మ వు
న్వీరాగ్రేసరవంశజాతవకటా! పెంపేది యీదృ క్శుభ
ప్రారంభంబున నౌచితీ విరహిత వ్యాపారము ల్నీమదిం
జేరన్నెంచుట యొప్పునే? నృపవధూ శీలంబు పాలింపవే!

హేమ.—తండ్రీ, ఈశ్వర కటాక్షంబున, నాపదలం గడచి మనమెల్లర మొక్కచో స్థావరంబుగ నెలకొను భాగ్యంబును, మఱియుం గోర్కులమేర మీరు సర్వ భద్రంబులును జేకూరియు మీ వీడ్కోలు స్మరించినంతనే నామనంబెంతయు వింత వికృతిపాలగుచున్న యది. తండ్రీ యీయకారణ వికారంబునకుం బారంబుగాన రాకున్న యది.

జనా.—అమ్మా, అచిరంబుననే కాంచెదవు గాక.

శా. శూరాగ్రేసరు లార్యశీల నిరతుల్పుం భర్తృ గీతాపాదమో
దారస్వాంతులు నీతి విక్రమకళాధౌరేయులౌ పుత్రుల
న్గారా మొప్పఁగఁ గాంచి యానత శిఖాగ్రస్థాయివై వీరసూ
స్ఫారశ్రీనలరారి నీడెదవు మాపై మోహబంధంబులన్.

[తెరపడి పోవును]

—೦೦೦—

# ప్రియదర్శికా నాటిక

## ఈనాటకమునందు వచ్చు పాత్రములు

1. సూత్రధారుఁడు.

2. వత్సరాజు—పేరు ఉదయనుఁడు కథానాయకుడు.

3. విదూషకుడు — పేరు వసంతకుఁడు.

4. విజయసేనుఁడు—వత్సరాజసేనాని.

5. కంచుకి —వాసవదత్త పినతల్లి పెనిమిటియు, అంగరాజ్యాధిపతియు, ప్రియదర్శిక తండ్రియునగు దృఢవర్మని వృద్ధకంచుకి—పేరు వినయవసుఁడు.

6. వాసవదత్త —వత్సరాజు నగ్రమహిషి.

7. సాంకృత్యాయని—ఒక పరివ్రాజిక. వాసవదత్త కాప్తురాలు.

8. కాంచనమాల—వాసవదత్త చెలికత్తె.

9. ఇందీవరిక —వాసవదత్త పరిచారిక.

10. ప్రియదర్శిక —వాసవదత్త పినతల్లికూతురు- కథానాయిక.

11. ఆరణ్యిక—ప్రియదర్శిక ప్రచ్ఛన్నముగానున్నప్పటి మారుపేరు.

12. ప్రతీహారి—వత్సరాజు ద్వారపాలిక- పేరు యశోధర.

